ఓం



శ్రీ సద్గురుభ్యోనమః

# శ్రీ నిజగురు భావార్థయుక్త అనుష్టాన పూజ విధానము

భావార్థ విశ్లేషకులు

పూజ్యనీయులు 'సభాసామ్రాట్ మరియు అచలబోధ వాచస్పతి' బిరుదాంకితులు

శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయార్యస్వాములు, ధర్మవరం.

గ్రంథసేకరణ కర్త

శ్రీ గుణరూపరహితానంద బండారు హనుమంతార్యులు, కె.జి.యఫ్:

శ్రీ పూర్ణాంబ అల్వాల పార్వతాంబ రాజయోగీంద్రులవారిచే

**ఈ గ్రంథమును ఉచితముగా**

ఇచ్చుటకు నిశ్చయించి వారి స్వంత ద్రవ్యముచే ముద్రించబడినది.

**2004**

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

# శ్రీ నిజగురు భావార్థయుక్త అనుష్టాన పూజ విధానము

భావార్థ విశ్లేషకులు

పూజ్యనీయులు 'సభాసామ్రాట్ మరియు అచలబోధ వాచస్పతి'

బిరుదాంకితులు

శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయార్యస్వాములు,
ధర్మవరం.

గ్రంథసేకరణ కర్త

శ్రీ గుణరూపరహితానంద బండారు హనుమంతార్యులు,
కె.జి.యఫ్.

శ్రీ పూర్ణాంబ అల్వాల పార్వతాంబ రాజయోగీంద్రుల
వారిచే ఈ గ్రంథమును
ఉచితముగా యిచ్చుటకు
నిశ్చయించి వారి స్వంత ద్రవ్యముచే ముద్రించబడినది.

తా॥ 15-2-2004 వెల : అమూల్యం

# తొలిపలుకు

శ్రీ మద్రామడుగు శివరామ దీక్షిత అచల గురు సాంప్రదాయక గురుభక్త జనులారా! మన పూర్వీకులు విచారణ చేసి మనకు ఎంతో విజ్ఞానాన్ని అందించినారు. వారి మార్గాన్ని అనుసరిస్తూ మనమందరము కూడా జన్మరహితస్థితిని పొందవలెను. ఆ మహనీయులు అందించినటువంటిదే ఈ నిత్యానుష్టానము. ఈ అనుష్టానము సంస్కృతపదములతో వున్నందువల్ల, సామాన్యులకు అందులో వుండే భావము తెలియడము లేదు.

రెండు సంవత్సరముల క్రింద నందికొట్కూరులో శ్రీ అల్వాలు క్రిష్ణమూర్తి గారు నిత్యానుష్టానమునకు భావార్థములు వ్రాసి పుస్తకరూపములో ముద్రించితే అందరికి అనుకూలంగా వుంటుంది అని అన్నారు. ఇది వారి సంకల్పమే. నేను మా పరమగురువులైన, పూజ్యనీయులు "శ్రీ సభాసామ్రాట్ మరియు అచలబోధవాచస్పతి" బిరుదాంకితులు శ్రీ వివేకానంద బండారు సుబ్బయార్య స్వాములవారిని 'నిత్యానుష్టానము'నకు భావార్థములు చెప్పాలని ప్రార్థించగా, ఆ మహానుభావులు దయాహృదయులై చెప్పడానికి సమ్మతించినారు. ఈ గ్రంథాన్ని శ్రీ పూర్ణాంబ అల్వాల పార్వతాంబ రాజయేగీంద్రులవారి స్వంత ద్రవ్యముచే ముద్రించబడినది. ఇది అంతా కూడా మద్గురు దేవులైన శ్రీ అద్వయానంద వెంకటరమణార్యస్వాములవారి ఆశీస్సులు.

నా ఆశయానికి అనుగుణముగా పుస్తకాన్ని సర్వాంగ సుందరముగా ముద్రించి ఇచ్చిన 'విజయవాణి ప్రింటర్స్' యజమాని శ్రీ యన్. సుధాకర్‌మూర్తి గారు, చౌడేపల్లె వారికి నాయొక్క కృతజ్ఞతలు.

ఇట్లు
శ్రీ గురుపదసేవకుడు
శ్రీ గుణరూపరహితానంద బండారు హనుమంతార్యులు
కే.జి.ఎఫ్

# పీఠిక

సాంప్రదాయక పాఠక మహాశయులారా!

మన సాంప్రదాయకమందున గురుమాల మంత్రము, ద్వాదశి, శోడశిమంత్రములను సంస్కృత భాషయందున షడంగములు, కరన్యాసము, అంగన్యాసము, ధ్యానశ్లోకములు, అన్ని క్రమపద్ధతిగా రచించినారు. ఆనాటి పండిత లోకమునకు అది మాతృభాషగా వున్నందువలన వారికి సులభముగా అర్థమయ్యేవి. కాని నేడు ఈ గురుబోధ అనె అచల సిద్ధాంతము సర్వజనులకు ఆచరణ యోగ్యమైనందువలన, సామాన్యమైన చదువురలకు, చదువురాని వారికి, ఈ మంత్రములు ధ్యానింపదగినివిగా యున్నవి. సాంప్రదాయ పద్ధతిని అనుసరించి చాలమంది అనుష్టానము చేసుకుంటు వున్నారు. కొంతమంది భక్తులకు అర్థముగాక అనుష్టానము చేయడమెందుకని అనడమువల్ల, మరి అనుష్టానమునకు అర్థము తెలిపిన యెడల అందరికి ఆనందదాయకముగా యుండునని కొంతమంది ప్రార్థించగా, తెలిపిన భవార్థములివి.

మంత్రశాస్త్రమందున ఋషి, ఛందస్సు, దేవత, భీజము, శక్తి, కీలకము అని ఆరు అంగములు, కరన్యాసము, అంగన్యాసములచేత మంత్రాధిదేవత లకు రూపకల్పనచేసి, ఆ దేవత యొక్క స్వరూప, స్వభావలను వర్ణించేటివి ధ్యానశ్లోకాలు. ఇవి ద్వాదశీ, షోడశీ సిద్ధాంత వాక్యాములైనప్పటికి, మంత్రము లకు వున్న పద్ధతులన్ని తెలిపి, మననము చేయదగినవి గాను, మరచిపోకుండా జపింపదగినవిగాను, వున్నందువలన మంత్రశాస్త్ర పద్ధతిగానె ఈ క్రమములన్ని వ్రాసినారు. కనుక వీటియొక్క అర్థములు తెలిసి అనుష్టానము చేసిన యెడల, మనము జపించునటువంటి ఈ మూడు మంత్రములకు సరియైన అర్థము గ్రహించి అనుష్టానము చేసిన వారగుదుము. అందువలన మన సాంప్రదాయ రహస్యములను ఈ భావార్థములుగా వ్రాయడమైనది. వీటి నిజార్థములను మీ గురువుల దగ్గర చక్కగా విచారించి సందేహరహితులై గురువాక్యసిద్ధి పొంది తరింతురుగాక అని ఆశిస్తున్నాము.

ఇట్లు
శ్రీ గురుపదసేవకుడు
శ్రీ వివేకనంద బండారు సుబ్బయార్యులు,
ధర్మవరం.

# శ్రీమత్ శ్రీధర స్వాముల వారి ప్రియ శిష్యులు




## శ్రీ శివరామ దీక్షితులవారు

శ్రీమత్ పరశురామ సీతారామ స్వాముల వారి
ప్రియ శిష్యులు



శ్రీ శ్రీ శ్రీ మద్రాజాధిరాజ మహరాజ యోగీంద్రులైన

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభులవారు.

# శ్రీభూమానంద ఆడెపు రాజ యోగీంద్రుల వారి
# ప్రియ శిష్యులు



## శ్రీ అచలాంబ సుబ్బ లక్ష్మాంబ రాజయోగీంద్రులు

ప. శ్లో॥ భావాతీతం మహాద్భుతం। ప్రవక్ష్యామి పరమంశివం
నహి నహి పునర్భవం। వందే సుబ్బలక్ష్మాంబ గురుంభజే॥

## శ్రీ అచలాంబ సుబ్బలక్ష్మాంబ రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులు



## శ్రీ పూర్ణాంబ అలువాల పార్వతాంబ రాజయోగీంద్రులు

ప. శ్లో॥ శ్రీమత్ బృహద్వాశిష్ఠ రాజయోగ వర్తనం
సిద్ధాంత, రాద్ధాంత సంయుక్త ప్రచారకం
అచలాంబ సుబ్బలక్ష్మాంబ పాదసేవితం
శ్రీ పూర్ణాంబ అలువాల పార్వతాంబ గురుంభజే॥

## శ్రీపూర్ణాంబ అలువాల పార్వతాంబ రాజయోగీంద్రులవారి
## ప్రియ శిష్యులు



**శ్రీ శాంతానంద అలువాల కృష్ణమూర్తి రాజయోగీంద్రులు**
**శ్రీ నిర్మలాంబ అలువాల పార్వతమ్మరాజయోగీంద్రులు**

ప. శ్లో॥ ఆత్మానాత్మద్వయాతీతం। అచలబ్రహ్మోపదేశిక శాంతానంద
క్రిష్ణమూర్త్యార్య, నిర్మలాంబ పార్వతమ్మ సద్గురుభ్యోనమోనమః॥

## శ్రీ నిర్మలానంద గట్టు నాగయార్య యోగీంద్రుల వారి ప్రియ శిష్యులు



"సభాసామ్రాట్ మరియు అచలబోధ వాచస్పతి" బిరుదాంకితులు

శ్రీ శ్రీశ్రీ లక్ష్మీసమేత వివేకానంద బండారు సుబ్బయార్యులు.

# శ్రీ అద్వయానంద వెంకటరమణార్య యోగీంద్రులవారి
# ప్రియ శిష్యులు



శ్రీ నిత్య పూర్ణాంబ లీలావతాంబ సమేత

గుణరూపరహితానంద బండారు హనుమంతార్యులు

# జండా వందన గీతము

1. జండాను పైకెత్తుమన్నా - అచల జండా
క్రిందానిలచిదండ మిడుమన్నా ॥జండాను॥

2. అన్ని వేల్పులకన్నా మిన్నా - దీని కన్న
వేరొండు లేదన్న మాయన్నా ॥జండాను॥

3. వేదాంతసారమోయన్నా - మాయ
వాదరహితంబైన బోధగనుమన్నా ॥జండాను॥

4. మోక్షమే బట్టబయలన్నా - అందు
సాక్షితత్వము లేని సంజ్ఞనే సున్నా ॥జండాను॥

5. బ్రహ్మ విష్ణు మహేశులన్నా - పరబ్రహ్మ
తత్వంబిదే బయలు గనిరన్నా ॥జండాను॥

6. శివరామ దీక్షితులజండా - ఇదీ
భవనాశస్థితిలేని పరిపూర్ణ జండా ॥జండాను॥

# మహాసంకల్పము

మనము ఏ పూజ చేయాలన్నా, శుభకార్యములు చేయాలన్నా ముందుగా సంకల్పిస్తాము. అందువల్ల మొట్టమొదట సంకల్పము చేసే, మనము గురుపూజ చేయాలి. నిజముగా సంకల్పము ఎట్లా వుంటుందంటే

1. **పంచదశీ మహామంత్రార్థాంతర్గత జగసృష్టి మధ్యే**
   **అశరీర గురుపద శాంతి స్నానమహం కరిష్యే**

   భావార్థము : నేను మొట్ట మొదట ఏం చేస్తాను అంటే పంచదశీ మహామంత్రము చేత చెప్పబడే ఈ జగత్తు కలవలె తోచినటువంటిదని, ఈ జగత్ సృష్టి మధ్యలో అశరీర గురుపాదములను సేవించేటటువంటి వాడ్ని నేను. ఆయన పదజలముల చేత స్నానము చేసి, శాంతిని పొందుతాను అని మొట్టమొదట సంకల్పిస్తాను.

2. **శ్రీ ఖండాఖండ విరహితాయ మద్గురు పాద సన్నిదౌ**
   **శ్రీ నిజగురు దర్శన, స్పర్శన కరుణా కటాక్షవీక్షణ సిద్ధ్యార్థము**

   భావార్థము : అటువంటి నిజగురు సన్నిదానములో చేరినప్పుడు నేను ఏమికోరుతానంటే 'ఖండాఖండవిరహితాయ'. ఇప్పుడు మనకు సృష్టి అంతా ఖండా ఖండములుగా కనబడతావుంది. దీనికి పరిచ్ఛిన్న భావమే మూలకారణము, కాబట్టి అఖండముగా వుండాలి. అందువలన ఖండా ఖండములుగా కనబడుదాన్ని విరహితాయ. దాన్ని పోగొట్టుకునె దానికి మద్గురు పాద సన్నిధికి వచ్చి ఆయన యొక్క దర్శన, స్పర్శన, కరుణా కటాక్ష వీక్షణములు నేను సిద్ధి పొందే దానికి మహాసంకల్పము చేస్తున్నాను.

3. **శ్రీ నిజగురు లఘు పరాపూజా మంత్రానుష్టాన విధాన మహం కరిష్యే.**

   భావార్థము : నేను మొట్టమొదట లఘుపూజ చేస్తాను. తరువాత జ్ఞానపూజ చేస్తాను. మరి గురువుగారు నన్ను కడతేర్చడానికి ఏ మంత్రములైతె చెప్పినారో, ఆమంత్రములను అనుష్టానము చేస్తాను.

4. **అస్మిన్ గురుపద శాంతి స్నానసమయే, మద్భ్రమ సృష్ట్యారభ్యాం**

   భావార్థము : సద్గురు సన్నిదానములో వారి పదముల యొక్క స్నానము, వారు వివరించేటటువంటి పదములలోని అర్థాన్ని గమనించి చూస్తే, సృష్టి

ఎట్ల పుట్టింది అంటే 'మద్భ్రమ సృష్ట్యారభ్యాం' నాకు ఎప్పుడైతె భ్రమ తోచిందో అప్పుడు సృష్టి వచ్చింది. ఈ భ్రమచేతనే జగత్తంతా తోస్తావుంది.

5. **బ్రహ్మానంద నామ సంవత్సరే - తుర్యాతీత అవ్యక్తన్నామ ఋతౌ**

**భావార్థము :** 'బ్రహ్మానందనామ సంవత్సరే' అని గురువుకు ఎందుకు వాడతారంటే 'బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం' అని గురువుగారి సన్నిధానములో వాడతారు. గురుముఖంగా బాగా విచారించి చూస్తే ఈ లౌకిక విషయానందముల కంటే గురువు పొందే ఆనందము చాల గొప్పది. అందుకే గురువు గారికి బ్రహ్మానంద నామసంవత్సరే అని అంటారు. 'తుర్యాతీత అవ్యక్త నామఋతౌ' తుర్యాతీతము, అవ్యక్తమైనటువంటి వస్తువు ఒకటి మనకుంది తుర్యము అంటే జ్ఞానము, ఎరుక అని, ఈ తుర్యము అనేటటువంటిది ఎక్కడ నుండి పుట్టుతావుంది అంటే, చైతన్యమైనటువంటి అవ్యక్తమైన గురుశక్తి నుండి పుడుతావుంది. ఇదియే తుర్యాతీత అవ్యక్తఋతౌ.

6. **జ్ఞానాజ్ఞాన శూన్యమాసే, కేవలాత్మ పక్షే.**

**భావార్థము :** జ్ఞానా జ్ఞానము యొక్క పూర్వాపరములను (మంచి చెడులను) విచారించి అది సరిగా లేదని నిర్ణయము చేయడమే దీనికి మాసము. మనము శుక్ల పక్షమని భహుళ పక్షమని అని అంటాము. కాని ఇది కేవలాత్మపక్ష అంటే పరిపూర్ణ ధర్మము పక్షే.

7. **జన్మాంతర మర్మపుణ్యాతిథౌ, నిష్కలవాసరే**

**భావార్థము :** అనేక జన్మ సుకృత ఫలవిశేషము చేత మానవునికి జ్ఞానము లభ్యమవుతాది. లేకపోతే వానికి ఈ ప్రపంచము రుచిగా, మధురంగా కనబడతాది. అక్కడనే వాడ్ని ముంచుతాది. జ్ఞానప్రకాశము అనె వెలుగు చూడకపోతే వాడికి అబద్ధమే నిజముగా కనబడతుంది. 'నిష్కలవాసరే' మనకు శనివారము, ఆదివారము, సోమవారములు అనే కళరూపమైనటువంటి వారములు వున్నవి. ఇవి నిష్కలంగా వుండి కళను గమనిస్తాది. కాని నిష్కలమైనట్టి స్వరూపాన్ని గుర్తెరుగలేదు. అందుకే నిష్కలము దీనికి వాసరము.

8. **ప్రకృతి ద్వయదోషరహిత నక్షత్రే, స్వప్నావరణ గోత్రస్య**

**భావార్థము :** ప్రకృతి పురుషులు ద్వయదోషముల రహితమే నక్షత్రం, అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి అని 27 నక్షత్రాలు చెప్తాము. ఈ నక్షత్రాలే

చంద్రుని అంటిపెట్టుకొని యుంటాయి. వీటినే చంద్రునికి తిథులు, వారాలు, భార్యలు అని అంటారు. అలాగే మనస్సుకు అధిపతి చంద్రుడు. ఈ మనస్సు కూడా 27 గుణాలు వుండాయి. అందుకే గుణదోషము కలిగిన నక్షత్రాలు రహితము కావాలని కోరుతారు. 'స్వప్నావరణ గోత్రస్య' గోత్రము అంటే ముట్టరానిది, అంటరానిది అని అర్థము. అంటే ఇక్కడ స్వప్నావరణమును పరిత్యజించేది గోత్రము.

**9. అవినాశ ఛందాయ, అభవోదేవాయ, అమృత భీజాయ**

**భావార్థము :** 'అవినాశఛందాయ' ఛందస్సు అంటే వేదము ఇక్కడ వేదము ఏది అంటే నాశనము లేని పరిపూర్ణ బ్రహ్మమును చెప్పేది దీని వేదము. 'అభవోదేవాయ'. పుట్టుక లేనట్టి తత్వాన్ని ప్రత్యక్షంగా నిరూపించేదే దీనికి దేవత. 'అమృత భీజయ' మృతము లేనట్టిదే దీనికి భీజము అయినది.

**10. భ్రమర్బ్రహ్మైవాహమస్మి అహం పదార్థ రాహిత్య**

**భావార్థము :** భ్రమరూపముతో నేను బ్రహ్మనైతిని అని ఎద్దైతె అంటా వుండాదో అటువంటి అహంపదార్థరాహిత్యము కొరకు చెప్తావుండారు.

**11. అప్రమేయ శక్త్యాయ, మమవ్యవహారిక స్వప్నోద్యోగానాం**

**భావార్థము :** 'అప్రమేయ శక్త్యాయ' ఏదాని ప్రమేయము లేనటువంటిది దానికి శక్తి, మనకందరికి ఒకరి ప్రమేయము వుండాలి, సంసారము చేయాలన్నా, రాజ్యాంగాలు చేయాలన్నా, గురుత్వము చేయాలన్నా ఒకరి సహాయము వుండాలి. అయితే పరిపూర్ణ పరబ్రహ్మము ఒకటి యున్నది. అదే మనల్ని కడతెర్చె మహాశక్తి. 'మమవ్యవహారిక స్వప్నోద్యోగానాం' నా వ్యవహరము ఎట్లవున్నదంటే నాలుగు అవస్థలుగా వున్నవి. స్వప్నలోకాలలో వ్యవహరించడమే నా పని.

**12. బాల్యయౌవన కౌమార వార్థిక్యకాలే, విద్యావిద్య కర్మజన్మవాసన రహితాయాం'**

**భావార్థము :** 'మనకు నాలుగు అవస్థలున్నవి అవి బాల్యము, కుమారత్వము, యౌవనము, ముసలితనములు, విద్య అవిద్యలు అనే రెండు దాటడానికి సద్గురు సన్నిదానములో చేరి ఈ కర్మ జన్మలనే వాసనలను రహితము చేసుకొనవలెను.

13. నిస్తరంగ నిజగురు పదశాంతి స్థాన సిద్ధ్యార్థం।
**షోడశోపచార పూజావిధాన మహం కరిష్యే॥**

**భావార్థము :** మనము నిజగురుపదములతో ఆయన సన్నిదానములో శాంతి చెందుచున్నాము. 'షోడశోపచార పూజా విధాన మహం కరిష్యే' అటువంటి సద్గురునకు షోడశోపచార విధంగా పూజ చేయాలి.

మనము ఎప్పుడైన విగ్రహారాధన చేసేటప్పుడు పూజారి, మీ పేరు, గోత్రము చెప్పండి మీకు సంకల్పము చేయాలి అని అంటారు. ఎప్పుడైన నదుల దగ్గరికి అంటే కృష్ణ, గోదావరి, గంగ నదుల దగ్గరికి వెళ్ళితె బ్రహ్మణులు మనల్ని వెతుకుంటు సంకల్పము చేస్తాము అంటువస్తారు. ఇప్పుడు మనం కూడా గురుసన్నిధానములో గురువు సజీవమైన దైవం కదా! అందువల్ల ఈ మహసంకల్పాన్ని వాళ్ళ దగ్గర చేసి, తరువాత కలశాన్ని ఆరాధిస్తాము.

# కలశ పూజ

మనము ఏదైనా శుభకార్యములు చేసేటప్పుడు, ముఖ్యంగా పూజలకు కలశము పెట్టి పూజ చేస్తాము. మనము పూజకు పెట్టి పూజించే ఆ కలశము గురించి విచారము.

1. **కలశస్యముఖేవిష్ణు: కంఠేరుద్రస్సమాశ్రితా:**

**భావార్థము :** ఇప్పుడు ఈ సృష్టి అనే కలశము యొక్క ముఖము మనకు కనబడతావుంది. ఆ ముఖస్థానములో విష్ణువు వుంటాడు. 'కంఠేరుద్రస్స మాశ్రితా:' దీని కంఠస్థానములో రుద్రుడున్నాడు. సృష్టికి కంఠస్థానములో లయ స్వరూపుడైన రుద్రుడున్నాడు.

2. **మూలే తత్రస్థితోబ్రహ్మ, మధ్యే మాతృగణాస్మృతా:**

**భావార్థము :** దీని సృష్టి స్థానములో బ్రహ్మదేవుడున్నాడు. ఈ సృష్టిమధ్యలో మాతృగణములు, పితృగణములు వుండారు. తల్లిదండ్రులు కలసి సృష్టిని అభివృద్ధి చేస్తావుండారు.

3. **కుక్షేతు సాగరా స్సర్వే, సప్తద్వీపావసుందరా**

**భావార్థము :** దాని గర్భమందు సప్తసముద్రములున్నవి. 1. లవణ సముద్రము 2. యిక్షు సముద్రము (చెమట) 3. సురసముద్రము

4. సర్పిసముద్రము 5. దధిసముద్రము 6. క్షీరసముద్రము 7. శుద్ధోదక సముద్రము.

సప్త ద్వీపములు అంటే ఏడు ద్వీపములు వాటిని మనము ఖండాలు అని అంటాము. వేదకాలములో వీటిని ద్వీపాలు అని అంటారు. అవి 1. జంబు ద్వీపము 2. ప్లక్ష ద్వీపము 3. శాఖద్వీపము 4. శాల్మతి ద్వీపము 5. పుష్కరద్వీపము 6. కుశద్వీపము 7. క్రౌంచద్వీపము. ఈ వసుంధర అనేటటువంటి భూమిలో ఈ సప్త ద్వీపాలు వున్నవి.

**4. ఋగ్వేదో, యజుర్వేదోసామవేదో హ్యాధర్వణః**

**భావార్థము :** ఋగ్వేదము మాటలచేత తనభావాన్ని చెబుతుంది. ఈ వేదమే ఈనాడు సృష్టిలో ఎలా జీవించాలి అనే విధానాలను వ్రాసిపెట్టింది. ఇక యజుర్వేదము మంత్రరూపములో ధ్యానము చేసేది వ్రాసింది. సామవేదము గాన రూపములో వేదాలను ఎలా ఉచ్చరించాలా అని వ్రాసింది. మరి యాంత్రిక విధానము, పనులు చేసే విధానమును తెల్పినది అధర్వణ వేదము. ఈ వేదములలో వుండే రహస్యాన్ని చెప్పినారు.

**5. అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితః**

**భావార్థము :** ఇంతవరకు చెప్పినటు వంటి అంగములన్ని ఏవైతే వుండావో, అవి అన్ని అంటే మూలంలో బ్రహ్మ, పోషణములో విష్ణువు, లయములో ఈశ్వరుడు, మధ్యములో మాతృగణాలు, తరువాత సప్త సాగరములు, సప్త ద్వీపములు ఇవన్ని కూడా సృష్టి అనే కలశాన్ని ఆశ్రయించి యున్నవి.

**6. ఆయాంతు గురు పూజార్థం దురితక్షయ కారకాః**

**భావార్థము :** గురుపూజ కొరకు, అమంగళములు జరగకుండా వుండేందుకు కలశాన్ని అక్కడ పెట్టినారు.

**7. గంగేచ యమునేచైవ గొదావరి సరస్వతి నర్మదే**
**సింధు కావేరి జలస్మిన్ సన్నిధిం కురుకావేరి తుం**
**గ భద్రాచ కృష్ణవేణీ చ గౌతమి భాగీరతీ చ**
**విఖ్యాతా పంచ గంగా ప్రకీర్తితాః**

**భావార్థము :** మొత్తము ఈ నదుల జలముతో అంటే నదుల పేర్లు వేరయినా, జలము ఒక్కటే, జలమునకు భేదము లేదు. అయితే ఆయా

భూమి రంగుబట్టి నీటిరంగు వుండవచ్చు, కాబట్టి ఈ నదులను పరమ పవిత్రంగా భావించి, కలశోధకమును అంటే కలశములో వుండే నీటిని తీసుకొని, ఆ నీటిని వాడుకుంటారు.

8. **కలశోధకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య, దేవమాత్మానంచ సంప్రోక్ష్య**

**భావార్థము :** ఈ సృష్టి అనే కలశోధకమును, అంటే కలశములో వుండే నీటిని తీసుకొని, ఆ పూజాద్రవ్యాలన్నిటిని సంప్రోక్షణముచేసి, అక్కడ పూజకొరకువున్న దేవుణ్ణి లేదా విగ్రహాన్ని సంప్రోక్షణ చేసి 'ఆత్మానంచ సంప్రోక్ష్య' అంటే తన మీద చల్లుకొని, అప్పుడు ఆయన పరిశుద్ధుడయినట్లు భావించి మరిపూజ ప్రారంభిస్తారు.

ఈ విధంగా కలశపూజ చేస్తారు.

# నిత్యానుష్టానము

నిత్య అనుష్టానము అనేది సాంప్రదాయక పద్ధతిగా ఒకటి పెట్టినారు. అనుష్టానము అనేది కొన్ని సిద్ధాంతములో ఎక్కువగా వుంటాయి, కొన్ని సిద్ధాంతములో తక్కువగా వుంటాయి.

మన సాంప్రదాయములో జపములుగాక మంత్రముల అధిదేవతల యొక్క స్వరూపాన్ని, మంత్రముల యొక్క అర్థమువచ్చేటట్లుగా అనుష్టానము చెప్పినారు. కాని మిగత సౌర, శాక్తేయ సిద్ధాంతములలో పంచాక్షరీ, అష్టాక్షరీ లాంటి మంత్రములు అక్షర లక్షల జపం చేస్తారు. ఒక అక్షరానికి లక్ష చొప్పున, పంచాక్షరీ అంటే ఐదు లక్షలు, ద్వాదశాక్షరీ అంటే పన్నెండు లక్షలసార్లు జపము చేస్తారు.

మన సిద్ధాంతములో ముఖ్యంగా మూడు వాక్యములను తయారు చేసినారు. మూడు వాక్యములు కూడ విజ్ఞానముతో కూడుకున్నటు వంటివేగాని మూఢనమ్మకముగాను, మూర్ఖంగాను మంత్రజపము చేసేటివి కావు. పరిపూర్ణ మొకటి, లేనెరుకానెదొకటుండు, పరిపూర్ణ మెరుకాలు నెరిగి ఎరుకానుమాను, భక్తావినుమనేను, సంశయమిక బాధింపదనెను. ఈ పద్ధతిని

అనుసరించి, మంత్రములను తయారుచేసినారు మన పెద్దలు. ఇవి ఒట్టి మాటలతో, జపములతో కుదిరేటివి కావు. కాబట్టి వీటన్నిటికి కూడా విచారణ అవసరము. ఆ విచారణ చెప్పేటటువంటిదే ఈ మంత్రానుష్టానము. అందువల్ల మనము ప్రతి దినము తప్పకుండ అనుష్టానము చేయవలెను.

# అఖండ గురుస్తుతి

మనము స్తుతిచేసే అఖండగురుస్తుతి సృష్టికి ఆధారమైనటువంటి వస్తువు. మనము ఆ అఖండ గురువు యొక్క స్వరూపమును ఎలా అర్థము చేసుకోవాల? ఎలా అనుష్టానము చేయాలా? అంటే

**1. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరా।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ - తస్మైశ్రీ గురవేనమః॥**

**భావార్థము :** గురువు బ్రహ్మ ఏ విధంగా అయినారు అంటే చతుర్వేద సారమైనటువంటి మహావాక్యముల యొక్క లక్ష్యార్థములు బోధించుటచే గురుదేవులు బ్రహ్మస్వరూపులైనారు.

గురువు విష్ణువు ఎలా అయినారు అంటే జ్ఞానబోధను చేసి అజ్ఞానములో పడకుండ శిష్యులను రక్షిస్తారు. కాబట్టి గురుదేవులు సర్వులను కాపాడే విష్ణువైయున్నారు.

గురువు మహేశ్వరులు ఎలా అయినారు అంటే తన్ను ఆశ్రయించిన వారి అజ్ఞాన ఆవరణములను హరింపచేయుచున్నారు. కాబట్టి శ్రీగురుదేవులు సకలజగములను లయచేయు మహేశ్వరులైయున్నారు.

అంతేకాక త్రిగుణాతీతమగు బ్రహ్మతత్వమే తానగుటచే శ్రీ గురుదేవులు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపులై ప్రకాశిస్తున్నారు. అట్టి గురుదేవులకు నా నమస్కారములు.

**2. అజ్ఞాన తిమిరాంధస్య - జ్ఞానాంజన శలాకయా।**
**చక్షురున్మీలితం ఏన - తస్మై శ్రీ గురవేనమః॥**

భావార్థము : అజ్ఞానమనే తిమిరమువున్నందువల్ల, అంధకార బంధురంగానే వుంటుంది. ఈ అంధకారము పోవాలంటే జ్ఞానమనే అంజనము కావాలి. అప్పుడు 'చక్షురున్మీలితం' ఎంతో కాలంగా మూసుకొని

యున్న జ్ఞాననేత్రము అప్పుడు తెరుస్తుంది. అజ్ఞానము అంటే ఏది? నిన్ను నీవు తెలియకపోవడమే అజ్ఞానము. నీ స్వరూపమును నీవు తెలియకపోతె ఎన్ని తెలుసుకొన్న అది అజ్ఞానమే. అందుకే మీరు జ్ఞానాంజనమును పెట్టి మూసుకున్న జ్ఞాననేత్రములను తెరిపించినారు. కనుక అట్టి గురువులకు నా నమస్కారములు.

3. **స్థావరంజంగమంవ్యాప్తం - యత్కించిత్ చరాచరం।**
**త్వంపదం దర్శితం ఏన తస్మై శ్రీ గురవేనమః॥**

**భావార్థము :** స్వామి! ఇంతవరకు నేను ఎవరినో అనుకుంటిని. కాని 'స్థావరం జంగమం వ్యాప్తం' అంటే స్థావర జంగమ జీవుల చేత సృష్టిఅంతా వ్యాపింపబడి యున్నది. స్థావరము అంటే ఒకే చోట వుండి బ్రతికేటివి. ఉదా॥ చెట్లు, గుట్టలు, కొండలు, మొదలగునవి. జంగమములు అంటే తిరుగుతూ బ్రతికేటివి. ఉదా॥ పశువులు, పక్షులు, మానవులు మొదలగువారు. ఈ అన్నిటి లోపల 'త్వం' అనే నీయొక్క స్వరూపమే వుంది చూడునాయనా, నీ జ్ఞాన స్వరూపమేవుంది, వేరు లేదు అని అది దర్శింపచేస్తిరి. ఈ సృష్టి అంతా నీవే యున్నావని దర్శింపచేస్తిరి. అట్టి మీస్వరూపమునకు నా నమస్కారములు.

4. **అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః॥**

**భావార్థము :** మండలాకారంగా వుండేటటువంటి ఈ ప్రపంచానికి అఖండ పరమాత్మ ఆధారంగా వుంటుంది. కాబట్టి 'అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం' అఖండ పరమాత్మ మండలాకారంగా వుండే జగత్తుకు. అందులో వుండే చరాచర జీవులందరికి ఆధారభూతంగా వుంటారు కాబట్టి 'తత్' అనే పదముచేత దాన్ని పొందాల. దీన్ని దర్శించాల అని, అటువంటి 'తత్' పదాన్ని దర్శింపచేస్తిరి. కాబట్టి మీయొక్క స్వరూపమునకు నాయొక్క నమస్కారములు.

5. **చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం।**
**అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥**

**భావార్థము :** ఇప్పుడు మీ బోధ ఏంటే చిన్మయమనే జ్ఞానస్వరూపముతో ఈ సృష్టికి ఆధార భూతమైన పరమాత్మ ఏదైతే వుందో అదే నీవైతివి అని

నాకు బోధిస్తిరి. ఇప్పుడు నేను జీవుడనిగాని, శరీరము అనిగాని, ఒక వ్యక్తిని అనిగాని నాకు లేదు. ఈ సృష్టికి ఆధారభూతమైనటువంటి వస్తువు 'అసి' అంటే అయితివి. అంటే నీవైతివి అని చెప్పినారు కాబట్టి మీకు నా నమస్కారములు.

6. **చైతన్యం శాశ్వితం శాంతం - వ్యోమాతీతం నిరంజనం।**
**నాద బింధు కళాతీతం - తస్మై శ్రీ గురవేనమః॥**

**భావార్థము :** సృష్టికి ఆధారభూతమైన వస్తువు గురించి ఈ శ్లోకము చెబుతుంది. చైతన్యము, శాశ్వితము, శాంతం, వ్యోమాతీతం, నిరంజనం. వ్యోమము అంటే ఆకాశము, ఆకాశములో మనోబుద్ధి చిత్తము అహంకార రూపమైన అంతఃకరణము చలనముగా వుంది. ఈ నాద బింధు కళలకు అతీతమైనవంటి గురుతత్వాన్ని నాకు తెలిపినందులకు మీకు నా నమస్కారములు.

7. **త్వంపితా త్వంచమేమాతా - త్వంబంధు త్వంచదేవత।**
**సంసార ప్రీతి భంగాయ - తస్మై శ్రీ గురవేనమః॥**

**భావార్థము :** ఎప్పుడు సద్గురు పరమాత్మచేత తత్వమస్యాది మహ వాక్యములచే సృష్టికి కారణమైన పరమాత్మని తెలుసుకున్నానో, ఆ తరువాత నాకు సృష్టికనబడతావుంది. ఇంతవరకు అజ్ఞానదశలో వుండి ఎదో అనుకున్నాను. ఇప్పుడు గురువు దగ్గర విచారించి శాశ్విత బ్రహ్మము గురించి తెలిసినాక ఇక నాకు కనబడే ప్రపంచము ఎట్లుందంటే, నీవే తండ్రివి, తల్లివి, బంధువు, దేవుడవు ఇంక 'సంసారప్రీతి భంగాయ' అంటే జననమరణములు వుండవనే ప్రీతి పోయింది. ఆ విధంగా చేసిన మీకు నా యొక్క నమస్కారములు.

8. **ఆనందమానందకరం - ప్రసన్నం జ్ఞానస్వరూపం।**
**నిజబోధ యుక్తం యోగీంద్ర మీఢ్యం భవరోగవైద్యం**
**శ్రీ మహద్గురుం నిత్యమహంనమామి॥**

**భావార్థము :** 'ఆనందమానందకరం' ఆనందస్వరూపులై, ఆనందము కలుగ జేయువారు, 'ప్రసన్నం జ్ఞానస్వరూపం' ప్రసన్నులైనటువంటి జ్ఞాన స్వరూపులు. 'నిజబోధయుక్తం' మీరు నిజబోధను అర్థము అయ్యేటట్లుగా భావాన్ని

కలుగజేస్తారు. 'యోగీంద్రమీఢ్యం' యోగులచేత స్తుతింపదగినవారు, అంటే పుట్టుక చావులు అనేటటువంటి రోగములు పోగొట్టెటటువంటి వైద్యులు, అలాంటి మీకు నా నమస్కారములు.

9. మన్నాథా శ్రీజగన్నాధా। మద్గురో శ్రీ జగద్గురో।
మమాత్మసర్వభూతాత్మ। తస్మై శ్రీ గురవేనమః॥

**భావార్థము :** ఈ శ్లోకము ఎట్లుందంటే ఇక భేదగుణము లేదు. గురువనే భేదముగాని, దేవతా అనే భేదముగాని, పుట్టనే పుట్టదు. ఎందుకంటే నా నాథుడే ఈ జగమునకంతా నాథుడు. నా గురువే ఈ జగత్తుకంతా గురువు. నాయాత్మ సర్వభూతములందు వున్నది అనే తత్వమెపుడు వస్తుందో అది నిజమైనటువంటి ధర్మము. అప్పుడు గురువుకా భేదము లేదు. దైవానికా భేదములేదు. ఆత్మకా భేదములేదు. నీవు ఏ తరగతి నుండి చూచినా భేదబుద్ధి నశింపచేసినారు. అట్టి మీ స్వరూపమునకు నా నమస్కారములు.

10. హృత్పుండరీక మధ్యస్థం - సకలామ్నాయ సంస్తుతం।
ధ్యాయామ్యహం సదా భక్త్యా - సకలాభీష్ట దాయకం॥

**భావార్థము :** 'హృత్పుండరీక మధ్యస్థం' హృదయకమల మధ్యములో నున్నటువంటి పుండరీకం అంటే కమలము. 'సకలామ్నాయ సంస్తుతం' అన్ని వేదాలు కూడా స్తుతిస్తున్నాయి. హృదయకమల మధ్యమున గురుస్వరూపము అదే సర్వశక్తి సంపన్నము. అందుకే 'ధ్యాయామ్యహం సదా భక్త్యా, సకలాభీష్ట దాయకం' ఎల్లప్పుడు నిన్ను భక్తితో ధ్యానము చేసే జ్ఞానులకు, సిద్ధులకు హృదయకమలములో వుండావని, వాళ్ళ అభీష్టములు నెరవేర్చె శక్తి మీకు వున్నదని, స్తుతిస్తున్నారు. కాబట్టి మీకు నా నమస్కారములు.

11. నిరంతరం సర్వసందేహో - ఏకీకృత్యసుదర్శనం।
రహస్యయో దర్శయతి - భజామి గురుమీశ్వరం॥

**భావార్థము :** 'నిరంతరం' అంటే అనంతకాలము, 'సర్వసందేహో' అనేక సందేహములచేత బాధపడుచున్న నన్ను 'ఏకీ కృత్యసుదర్శనం' నాయనా! ఇదిగో నీయొక్క స్వరూపము, ఇదిగో పరమాత్మయొక్క స్వరూపమని చెప్పి దర్శనము చేయించి సర్వసంశయములను పోగొట్టినారు. 'సుదర్శనము' అంటే మంచి దర్శనము 'రహస్యయోదర్శయతి' రహస్యమైన దానిని దర్శింప చేస్తిరి. 'భజామి గురుమీశ్వరం' ఆ విధంగా గురుస్వరూపాన్ని నేను భజిస్తాను.

# శ్రీ గురుమాలా మంత్రము

ఓం నమః శ్రీ గురుదేవాయ। పరమ పురుషాయ। సర్వ దేవతావశీకరాయ। సర్వారిష్ట వినాశాయ। సర్వమంత్రచ్ఛేదనాయ। త్రైలోక్యం వశమానాయస్వాహా॥

ఓం నమః

భావార్థము : మొట్టమొదట నమస్కరింపదగినటువంటివారు.

శ్రీ గురుదేవాయ :

భావార్థము : శ్రీ అంటే పరమాత్మ స్వరూపము, అంటే గురువు సాక్షాత్ పరమాత్ముడని అర్థము.

పరమపురుషాయ :

భావార్థము : శ్రీ గురుదేవులు పరమపురుష స్థానములో వుంటారు. గురువునకు పరమపురుషులని ఎందుకు అంటున్నారంటే, ఈ పురుషునకు పురుషార్థములు నాలుగు. ధర్మము, అర్థము, కామములే కాకుండా నాల్గవ పురుషార్థమైన మోక్షాన్ని కూడా ప్రసాదించే శక్తి గురువుకు వున్నది కాబట్టి గురువుగారిని పరమపురుషాయ అని అంటారు.

సర్వదేవతా వశీకరాయ :

భావార్థము : గురువు సర్వదేవతలను వశము చేసుకున్నారు. ఎలా? అని అంటే సాంఖ్యమును విచారించేటప్పుడు పిండాండములో 25 తత్వములకు గల 25 అదిదేవతలను గురువు స్వాధీనపరుచుకున్నారు, కాబట్టి గురువునకు సర్వదేవత వశీకరాయ అని అంటారు.

సర్వారిష్ట వినాశాయ :

భావార్థము : 84 లక్షల జీవరాసులకు వచ్చె అరిష్టములు, అంటే కష్టములు అవే తాపత్రయములు. తాపములు అంటే కష్టములు, త్రయము అంటే మూడు అని అర్థము. తాపత్రయములు ఏవి అంటే 1. ఆధ్యాత్మిక తాపము 2. ఆది భౌతికతాపము 3. ఆది దైవిక తాపము అని, ఈ అరిష్టములు గురువు వినాశనము చేస్తారు గాబట్టి గురువు గారికి సర్వారిష్ట వినాశాయ అని అంటారు.

సర్వమంత్రచ్ఛేదనాయ :

భావార్థము : గురుమంత్రమును మనము ఎప్పుడైతే చక్కగా అర్థము చేసుకుంటామో, ఇక మిగతా క్షుద్రమంత్రములు అన్ని లేకుండా పోతాయి. క్షుద్రమంత్రములు అంటే 1. మోహన 2. ఉచ్చాటన 3. మారణ 4. వశీకరణ 5. ఆకర్షణ అనేటటువంటివి వున్నాయి. అందుకే గురువును సర్వ మంత్రచ్ఛేదనాయ అని అంటారు.

త్రైలోక్యం వశమానాయ స్వాహ :

భావార్థము : మూడు లోకాలు గురువుగారి వశములో వున్నవి. మనమందరముకూడా మూడు లోకాలలో ప్రయాణము చేస్తున్నాము. ఇప్పుడు ఈ లోకములో అంటే భూ లోకములో భోంచేసి పడుకున్నాము. ఈ లోకాన్ని మరచిపోతాము, ఇంకొక లోకము వస్తాది. అది స్వప్నలోకము దాంట్లో కొంత సేపు వుంటాము. ఆ తరువాత ఆ లోకము విడిచి వెళతాము. ఇక నిద్రలోకము వస్తాది. ఆ లోకములో కూడ కొంత సేపు వుంటాము. ఈ మూడు లోకాలలో క్షేమంగా వుండాలి! అలా కాకుండ ఏ అవస్థలలో ఏదైన లోపం వచ్చినా కష్టమే. అందువల్ల నేను ఈ మూడులోకాలలో సుఖంగా వుండవలెనని మిమ్మల్ని కోరుకుంటున్నాను. కాబట్టి గురువు గారిని త్రైలోక్యం వశమానాయ స్వాహ అని అంటారు.

# శ్రీ గురు గీతామాల మంత్రము

**శ్లో ॥ ఓం అస్యశ్రీ గురుగీతామాలామంత్రస్య భగవాన్**
**శ్రీ సదాశివ ఋషిః విరాట్ గాయిత్రిచన్దః శ్రీ గురు**
**పరమాత్మాదేవత, హంభీజం, సఃశక్తిః సోహం కీలకం**
**మమశ్రీ నిజగురుకృపాప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః॥**

భావార్థము : ఏ మంత్రమునకైన షడంగాలు వుంటేనే ఆ మంత్రము జపమునకు యోగ్యము అవుతుంది. లేకపోతే లేదు. షడంగములు లేని మంత్రములను జపించరాదు. కాబట్టి మంత్రమునకు షడంగములు వుండవలెను.

మంత్రమునకు 1. ఋషి, 2. చందస్సు, 3. దేవత, 4. భీజము, 5. శక్తి మరియు 6. కీలకం అని వుంటాయి. 'శ్రీ గురుగీతామాలా మంత్రస్య' అంటే శ్రీ గురుగీతామాలా మంత్రమునకు 'భగవాన్ శ్రీ సదాశివ ఋషిః' ఈ మంత్రమునకు ఋషి ఎవరు అంటే భగవాన్ శ్రీ సదాశివ ఋషిః. ఈ సృష్టి రహస్యమును బాగా అర్ధం చేసుకొని, ఈ సృష్టికి ఈ మంత్రరూపం చేస్తే సరిపోతుందని పరిశీలించి సృష్టి చేసినారు. సృష్టి చేసిన వారినే ఋషి అని అంటారు. 'విరాట్ గాయిత్రి చన్దః' మనకు విరాట్ స్వరూపము అంటే విశ్వమంతా కనబడతావుంది. మనకు ఎంత ప్రపంచమైతే కనబడతావుందో, వాటిని తెలుసుకొనే వేదమే దీనికి చంధస్సు. చంధస్సు అంటే వేదము. 'శ్రీ గురుపరమాత్మా దేవత' ఈ మంత్రానికి దేవత ఏవరు? అంటే శ్రీ గురుపరమాత్మ దేవుడు. 'హంభీజం సః శక్తిః' 'హం' అనేటి ఈశ్వర స్వరూపము భీజముగాను, 'స' అనేటటువంటి ప్రకృతి స్వరూపము శక్తిగాను, 'సోహం కీలకం'. ఈ 'సోహం' అంటే 'హకార' 'సకార' ములతో కూడుకొని మధ్యలో బింధు రూపము ఏదైతే వుందో 'హంస' అనే పదానికి మధ్యలో వుండె సంఖ్య. అట్లు పిండ బ్రహ్మండములకు ఆధారభూతంగా వుండే ఆ గురు పరమాత్మ స్వరూపమే నేను, నేనే ఆ గురుపరమాత్మ స్వరూపమని 'సోహం' అంటే ఆ బ్రహ్మము నేను. నేనే ఆ బ్రహ్మము అనేటటు వంటి అర్ధయుక్తముగా జపించే దానికి ఇది వచ్చింది. అందుకే సోహం కీలకము అయింది. ఈ విధంగా జపిస్తే సకలార్ధసిద్ధి కలుగుతుంది. ఎందుకంటే మనస్సు సకలేంద్రియములతో సహవాసం చేసింది. కాబట్టి సోహం కీలకం అయింది. 'మమశ్రీ నిజగురు కృపాప్రసాద సిద్ధ్యర్థేజపే వినియోగః'. శ్రీ నిజగురువు యొక్క కృపాప్రసాదము సిద్ధించే కొరకు ఈ విధంగా మంత్రాన్ని జపం చేయాలి అని అర్థము.

# అథ ధ్యానం

శ్లో॥ హంక్షాభ్యాంపరివృత్తపత్రకమలైర్థివ్యైర్జ గత్కారణం,
విశ్వోత్తీర్ణమనేక దేహ నిలయం, స్వచ్ఛంద మానందకం
ఆద్యంతైక మఖండ చిద్ఘనరసం పూర్ణంహ్యానంతం శుభం
ప్రత్యక్షాక్షర విగ్రహం గురుపదం ధ్యాయేద్విభుంశాశ్వతం॥

శ్లో ॥ హంక్షాభ్యాం పరివృత్తపత్రకమలైర్థివ్యైర్జగత్కారణం॥

భావార్థము : 'హంక్షాభ్యాం' హం, క్షం, అనేటటువంటి రెండు దళములు కలిగినటువంటి స్థలము ఆగ్నేయ చక్రము. ఇదే సంకల్ప వికల్ప స్వరూపమైనటు వంటిది. 'పరివృత్తపత్ర కమలైర్థి వ్యైర్జగత్కారణం' జగత్తుకు కారణమైనటువంటిది. ఈ కమలములన్నిటిపైన గూడా నిరాటంకముగా సంచరించేటటువంటిది.

శ్లో॥ విశ్వోత్తీర్ణమనేక దేహనిలయం, స్వచ్ఛందమానందకం॥

భావార్థము : 'విశ్వోత్తీర్ణమనేక దేహ నిలయం'. ఈ హంస సుషుప్తి అవస్థ నుండి, జగత్తును బయటికి బహిర్గతము చేసేటటువంటి శక్తి దీనికే వుంది. దీనికి ఇన్ని దేహములందు సృష్టి అంతా అదేవుంది. 'స్వచ్ఛంద మానందకం' మనకు విషయములతో కూడితే ఆనందం వస్తాది. కాని ఆత్మకు స్వచ్ఛందము, తననుండే తనకు ఆనందము వస్తాది. కాని ఇంకొక దాని నుండి వచ్చేది కాదు.

శ్లో ॥ ఆద్యంతైకమఖండ చిద్ఘనరసం పూర్ణం హ్యానంతం శుభం॥

భావార్థము : 'ఆద్యంతైక మఖండ చిద్ఘనరసం' ఆది అంతములలో కూడా అఖండ స్వరూపముగా వుండి, జ్ఞానానంద రసమయి వున్నటువంటి తత్వమది. 'పూర్ణం హ్యానంతం శుభం'. పూర్ణమైనటువంటిది. అంతము కానటువంటిది. శుభకరమైనటువంటిది ఆ గురువు యొక్క స్వరూపము.

శ్లో ॥ ప్రత్యక్షాక్షర విగ్రహం గురుపదంధ్యాయే ద్విభుం శాశ్వతం॥

భావార్థము : 'ప్రత్యక్షాక్షర విగ్రహం' ప్రత్యక్ష విగ్రహము, క్షర స్వరూపముకాక అక్షర స్వరూపమైయున్నది. 'గురుపదంధ్యాయే ద్విభుం

శాశ్వతం' జ్ఞానులకు ప్రత్యక్షార్థములలో కనబడేటటువంటి ఆ యొక్క గురుపదములను నేను ఎప్పుడు ధ్యానిస్తున్నాను. ఆయనే విభువు. శాశ్వితమైనటువంటి తత్వము అని ఆ గురువు యొక్క స్వరూపాన్ని ఈ మొట్టమొదటి శ్లోకములో వర్ణించినారు.

శ్లో॥ **విశ్వవ్యాపిన మాదిదేవ మమలం, నిత్యంపరం, నిష్కళం**
**నిత్యోద్బుద్ధ సహస్ర పత్రకమలేలుప్తాక్షరేమంటపే॥**
**నిత్యానందమయం, సుఖైకనిలయం, నిత్యం శివం, స్వప్రభం**
**ధ్యాయెద్ధం, సపరం పరాత్పరతరం స్వచ్ఛంద తస్సర్వదా॥**

శ్లో॥ **విశ్వవ్యాపిన మాదిదేవమమలం నిత్యంపరం నిష్కళం॥**

**భావార్థము :** 'విశ్వవ్యాపిన మాదిదేవమమలం'. విశ్వవ్యాపి అయినవారు, ఆదిదేవుడయినట్టివారు, మాలిన్యము లేని వారు. ' నిత్యం పరం నిష్కళం', నిత్యస్వరూపము కలిగినట్టి వారు, పరము అయినట్టివారు, కళంకము లేకుండా నిష్కళస్వరూపులు.

శ్లో॥ **నిత్యోద్బుద్ధ సహస్ర పత్రకమలేలుప్తాక్షరే మంటపే॥**

**భావార్థము :** 'నిత్యోద్బుద్ధ సహస్ర పత్రకమలే' నిత్యము ఉత్పత్తి అవుతావున్నవి. ఈ సహస్రపత్ర కమలముల నుండి 'లుప్తాక్షరేమంటపే' ఏ అక్షరములు వుండవు. అక్కడ నుండి భావములకు, భావములనేటటువంటి అక్షరములకు పుంకాను పుంకములుగా పుట్టించే శక్తి దీనికి వుంది. అందుకే 'సహస్రకమలే లుప్తాక్షరే మంటపే' అని అక్కడ ఏమిలేని చోటున అనందము అనుభవిస్తున్నావు. అక్కడ నుండే భావాలన్ని, సంకల్పాలన్ని కూడా ఉత్పత్తి అవుతావున్నవి.

శ్లో॥ **నిత్యానందమయం సుఖైక నిలయం, నిత్యంశివం స్వప్రభం॥**

**భావార్థము :** 'నిత్యానందమయం' నిత్యము ఆనంద స్వరూపము కలిగినటువంటివారు. 'సుఖైక నిలయం' ఆ నిలయము సుఖమునిచ్చె ఏకైక నిలయము, ఈ సృష్టిలో ఏది సుఖము నిచ్చేది అంటే సద్గురు పరమాత్మయొక్క సన్నిధానము ఏదైతే వుందో, ఆ స్థానము సుఖము ఇస్తాది. 'నిత్యం శివం స్వప్రభం'. ఈ శవమును శివముగా మార్చి తాను ప్రకాశించి, ఈ జడమైన శరీరాన్ని కూడా ప్రకాశింపచేస్తావుండే స్వప్రభము కలిగినటువంటివారు.

శ్లో॥ ధ్యాయేద్ధంస, పరం పరాత్పరతరం స్వచ్ఛంద తస్సర్వదా॥

భావార్థము : 'ధ్యాయేద్ధంస, పరం పరాత్పరతరం' ఈ హంసకు పైగా తిరిగేటటువంటివారు. ఈ హంసను కూడా లాగి వదిలేటటువంటి చైతన్య స్వరూపులు. 'స్వచ్ఛందతస్సర్వదా' అది స్వచ్ఛందముగా వుంటుంది. స్వచ్ఛందము అంటే ఏదేని ప్రమేయము లేకుండా తనకు తానుగా వుండేటటువంటి తత్వము. కాబట్టి గురు స్వరూపాన్ని అలా వర్ణిస్తారు.

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురో: పదం త్రిభువనోంకారఖ్య సింహాసనం
సిద్ధాచార సమస్తవేద పఠితం షట్చక్ర సంచారిణం
అద్వైతస్ఫురదగ్నిమేకమమలం పూర్ణప్రభాశోభితం
శాంతం శ్రీగురుపంకజం భజమనశ్చైతన్య చంద్రోదయం॥

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురోః పదం త్రిభువనోంకారఖ్య సింహాసనం॥

భావార్థం : 'ఊర్ధ్వామ్నాయగురో పదం' గురోర్పదము ఎక్కడ వుంది అంటే ఊర్ధ్వములో వున్నదని. 'త్రిభువనోంకారఖ్య సింహాసనం'. ఈ ఓంకారమనేటి సింహాసనము మీద వుండి త్రిభువనములను పరిపాలిస్తాది. త్రిభువనములు అంటే 'అ' కార, 'ఉ'కార, 'మ' కారములచేత వ్యాప్తి చెందినటువంటి సృష్టిని స్థూల, సూక్ష్మ, కారణ శరీర రూపములలో వీటిని పోషిస్తుంది.

శ్లో॥ సిద్ధాచార సమస్త వేదపఠితం షట్చక్ర సంచారిణం

భావార్థము : 'సిద్ధాచార సమస్తవేదపఠితం' సిద్ధులు, ఆచారులు, అయినటువంటి వారందరిచేత రచించబడినటు వంటి వేదములచేత పఠింపదగినటువంటిది. 'షట్చక్ర సంచారిణం' ఈ ఆరు చక్రములలో సంచరించేటటువంటిది.

శ్లో॥ అద్వైతస్ఫురదగ్నిమేకమమలం పూర్ణప్రభా శోభితం॥

భావార్థము : 'అద్వైతస్ఫురదగ్ని మేకమమలం' అన్నిటిలోనున్నతాను ఏకస్వరూపుడే, మలినము లేనటువంటి వారు. అందుకు 'పూర్ణప్రభాశోభితం'. ఇది పూర్ణప్రభ, బాగావిచారించి చూస్తే అన్నిటిలో కూడా అఖండముగా, అద్వైతముగా, రెండవది లేకోకుండా పూర్ణప్రభచేత శోభించేది.

శ్లో॥ శాంతం శ్రీగురుపంకజం, భజమనశ్చైతన్య చంద్రోదయం

భావార్థము : 'శాంతం శ్రీ గురుపంకజం' శ్రీగురుపాద పంకజములు ఎట్లా వున్నాయి అంటే శాంతము కలిగినటువంటివి. 'భజమనశ్చైతన్య చంద్రోదయం' ఎప్పుడైతే మనకు ఈ జ్ఞానచంద్రోదయము కలుగుతుందో అప్పుడు అంతా ఏకపదార్థంగా గోచరిస్తాది. అందువల్ల ఈ మూడు పెద్ద శ్లోకాల చేత గురుడు చేసేటటువంటి గొప్ప తనాన్ని ఈ ధ్యానశ్లోకాలు చెబుతున్నాయి.

శ్లో॥ నమామి సద్గురుం శాంతం ప్రత్యక్ష శివరూపిణం
శిరసాయోగ పీఠస్థం ముక్తికామార్థ సిద్ధిదం॥

భావార్థము : ఓ సద్గురుదేవా! మీ స్వరూపము ఏ విధంగా వుంది అంటే 'శాంతం ప్రత్యక్ష శివరూపిణం'. ప్రత్యక్ష శివస్వరూపులైన గురువు గారికి శాంతము ఎప్పుడు కలుగుతుంది అంటే ఎప్పుడైతే ఏ తాపములు ఏ కోరికలు ఏ బాధలు లేకుండా వున్నప్పుడు శాంతము కలుగుతుంది. అవిలేకుండా ఎలా వుండగలిగినారు గురుదేవులు అంటే, ఇవన్నీ నాయందు కల్పితములు. సత్యపదార్థములు కావు అని, తన నిజస్వరూపమైన శాంతమును తాను అనుభవిస్తావుండారు. 'శిరసాయోగ పీఠస్థం ముక్తి కామార్థ సిద్ధిదం'. అయ్యా! నా శిరస్సు యందున యోగపీఠము నందున ముక్తికావాలనే కోరిక చేత, ముక్తిని ప్రసాదించే మీ స్వరూపాన్ని నిరంతరము సహస్రార కమలమందున శిరస్సులో పెట్టుకొని ఆ సిద్ధి పొందేదానికి ధ్యానిస్తాను.

శ్లో॥ ప్రాతః శిరసి శుక్లాబ్జం ద్వినేత్రం ద్విభుజం గురుం
వరా భయకరం శాంతం స్మరేత్తన్నామ పూర్వకం॥

భావార్థము : 'ప్రాతఃశిరసి శుక్లాబ్జం'. తెల్లవారుజామున గురువుగారి పాదముల మీద వున్నటువంటి పుష్పాన్ని మన శిరస్సు మీద పెట్టుకోవాలి 'ద్వినేత్రం ద్విభుజం గురుం' రెండు నేత్రాలు, రెండు భుజములు కలిగిన ఈ గురువును నామోచ్ఛరణ పూర్వకముగా తలుస్తాము. ఎందుకంటే, 'వరాభయకరం శాంతం' అభయమును ప్రసాదించేవారు. శాంతమును ఇచ్చేవా... ...ఎట్టి గురుస్వరూపాన్ని నామోచ్ఛరణ పూర్వకముగా నేను తలుచుకుంటాను అని అంటారు. అంటే తెల్లని పుష్పము ఏది? గురువు గారియొక్క పదముల నుండి జాలువారినటు వంటి ఆ జ్ఞాన... అనేటటువంటి పుష్పమే మన శిరస్సులో ధరించవలసిన తెల్లటి పుష్పము.

శ్లో॥ ప్రసన్న వదనాక్షంచ సర్వదేవ స్వరూపిణం
త్వత్పాదోక జాధారా నిపతంతి స్వమూర్ధని॥

భావార్థము : 'ప్రసన్నవదనాక్షంచ' మనకు గురువుగారి యొక్క ముఖము ఎట్లా వున్నదంటే చింత, చీకాకుగా గాని లేదా ఏదో ఆలోచన చేసేవారుగా గాని, శిష్యునికి కనబడడంలేదు. ఎందుకంటే ఆయన ప్రసన్న వదనము కలిగినవారు. ఎప్పుడు ఆనందమును అనుభవించేవారు. 'సర్వదేవ స్వరూపిణం' ఈ దేవతలందరు సృష్టికి ఏఏ స్థానములో వుండి ఏఏ సహాయము చేస్తావుండారో, వారందరి రూపాలలో మీరే నాకు ఆ సహాయం చేస్తున్నారు. ఇన్ని రూపాలలో గురువు ఎందుకు కనబడతారంటే, వీరందరు ఆయన నియమించినటువంటివారు. కాబట్టి వీరందరి చేత ఆయన పూజింపదగిన వారు కనుక మనకు సర్వదేవత రూపుడుగా గురువే కనబడతారు. అందుకే 'త్వత్పాదోదక జాధార నిపతంతి స్వమూర్ధిని'. అయ్యా! ఆ మూర్ధిని స్థానములో నాభావము పతనము కాకోకుండ వుండేదానికి మీ పాదధార, మీ పాదోధకాన్ని, నిరంతరము నా శిరస్సులో ధరిస్తాను అని అంటాడు.

శ్లో॥ తయా సంక్షళయే దేహహ్యాంతర్బా హ్యగతం మలం
తక్షణా ద్విరజో భూత్వాజాయతె స్పటికోపమః॥

భావార్థము : 'తయాసంక్షళయే దేహహ్యాంతర్బాహ్యగతం మలం' మీ పాదోదకము ఎట్ల వున్నది, నాశిరస్సుపైన చల్లుకుంటే బాహ్యాభ్యంతరములలో వుండే మలీనము పోతాది. అంతరములో ఏమున్నది మలినము, అంటే రాగద్వేషములు అనే మాలిన్యము ఈ జీవికి అంటుకున్నది. ఈ లోపల వుండే రాగద్వేషాలనే మాలిన్యము ఎట్లా వుంటుందంటే 'తక్షణా ద్విరజోభూత్వా' రజము అంటే దుమ్ముఅని విరజము అంటే ఏ మాలిన్యము లేకుండా ఎట్ల వుంటాదంటే 'జాయతేస్పటి కోపమః' తెల్లటి స్పటిక మణివలె, ఆ హృదయము ఈ రాగద్వేషాలు అనే దుమ్ము పోయిన తరువాత, తెల్లని స్పటికమణివలె ప్రకాశిస్తాది అని అంటారు.

శ్లో॥ తీర్థాని దక్షణే పాదే వేదస్తన్ముఖ మాశ్రితాః
పూజయే దర్చితం తంతు తదభిద్యాన పూర్వకం॥

భావార్థము: 'తీర్థాని దక్షణే పాదేవేదస్తన్ముఖ మాశ్రితాః' మీ కుడి పాదమందున సమస్త పుణ్యతీర్థాలువున్నవి. పుణ్య తీర్థములతో పూనీతము

కావాలి అనేది గురువుకు లేదు. అపవిత్ర తీర్థములకు కూడా పుణ్యతీర్థఫలాన్ని ఫలింప చేసే శక్తి గురువుకుంది. అందువలన మీకుడి పాదమందున సమస్త పుణ్యతీర్థాలు. 'వేదస్తన్ముఖ మాశ్రితాః' వేదము, వేదాంతము మీ ముఖమును ఆశ్రయించి యున్నవి. అట్ల 'పూజయేదర్చితంతంతు తదభిధ్యాన పూర్వకం' అట్టి మీయొక్క స్వరూపాన్ని, మీ పాదపద్మములను నేను దర్శించి, స్పర్శించి, ధ్యానిస్తానయ్యా అనే భావము.

**శ్లో॥ సహస్రదళ పంకజే సకల శీతరస్మిప్రభం।**
**వరాభయ కరాంబుజం విమల గంధపుష్పాంబరం॥**

**భావార్థము** : 'సహస్రదళపంకజే' సహస్రారకమలము మీద వున్నారు మీరు. 'సకల శీతరస్మి ప్రభం' ఈ శరీరములో నిరంతరము అగ్ని ఎక్కువగా ప్రజ్వరిల్లుతాది. ఇది ఎట్లా ప్రజ్వరిల్లుతాది అంటే, జీవునికి సహజ అవస్థలో ఇవి ప్రజ్వరిల్లవుగాని, దీనికి పుట్టెటటువంటి కోరికలు, ఆ కోరికలు తీర్చుకోవల్ల అనే తాపత్రయముల చేత ఈ అగ్ని విపరీతముగా ప్రజ్వరిల్లుతాది. పూర్ణచంద్రుడు సకల శీతములను ప్రసాదించేటటువంటివాడు. ఈ 'శీతలరస్మి' ఎవరినుండి వస్తాదంటే చంద్రుడి నుండే వస్తావుంది. అట్ల జ్ఞాన చంద్రోదయము నుండి ఈ జీవులకు కలిగే సమస్త తాపత్రయములను పోగొట్టే శక్తి వస్తావుంది. 'వరాభయకరాంబుజం' మీకరము ఎటువంటిది అంటే అభయము ఇచ్చెటటువంటి మీయొక్క కరకమలములను 'విమల గంధపుష్పాంబరము' మలినము లేనటువంటి గంధము, పుష్పము, అంబరము. వీటన్నిటికి కూడా పవిత్రత వస్తాది. కాబట్టి అటువంటి మీ స్వరూపాన్ని ధ్యానిస్తాను.

**శ్లో॥ ప్రసన్నవదనేక్షణం సకలదేవతా రూపిణం**
**స్మరేచ్ఛిరసి హంసగంతదభిధ్యాన పూర్వం గురుం॥**

**భావార్థము** : 'ప్రసన్నవదనేక్షణం' ప్రసన్నమైన మీవదనమును వీక్షించినాను. 'సకలదేవతారూపిణం' అన్ని దేవతల స్వరూపము నాకు అందులోనే కనబడతావుంది. 'స్మరేచ్ఛిరసి హంసగం' స్థిరచిత్తముతో ఈ హంసమంత్రమును స్మరిస్తున్నాను. 'తదభిధ్యానపూర్వం గురుం' ఈ విధానమునంతా తెలియచేసినటువంటి మీ యొక్క స్వరూపానికి, ఇన్ని గొప్ప తనములతో ప్రకాశిస్తున్న మీకు నమస్కరిస్తున్నాను అని చెప్పి, ఆయన పంచపూజలు చేయవలెను.

# పంచ పూజలు

పంచపూజలు చేసెటప్పుడు మనము భీజములు, భూతములు, భూతములలో వుండేటటువంటి అన్ని కూడ గురువుకు సమర్పిస్తున్నాము. ఇవన్ని నావని నేను అనుభవిస్తున్నాను. కాబట్టి ఇప్పుడు అర్పణక్రియ కావాలి, అర్పణక్రియ జరిగితెనే మనము బంధరహితము అవుతుంది. అందుకు

1. లం : పృధివాత్మనే గంధతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే

**శ్రీ గురుదేవాయనమః పృధి వాత్మకం గంధం సమర్పయామి॥**

**భావార్థము :** ప్రకృతిలో ఆనందించడానికి గురుదేవా! నేను పృథ్వి స్వరూపానంతా గంధముగా చేసి మీకు సమర్పిస్తున్నాను. ఇప్పుడు పృథ్వి తత్వమేమైంది అంటే వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదము అనే కర్మేంద్రియములై యున్నది. ఈ కర్మేంద్రియములపై నుండేటటువంటి నా మనోవాసనాలు మొత్తము గంధముగా చేసి మీకు సమర్పిస్తున్నాను. కర్మేంద్రియములపై నుండేటటువంటి మమకారాన్ని గురువుకు అర్పించికదా! బంధ విముక్తుడు కావాలి. అందుకే ఇవన్ని మీకు సమర్పిస్తున్నాను.

2. **హం : ఆకాశాత్మనే శబ్ధతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**

**శ్రీ గురుదేవాయనమః ఆకాశాత్మకం పుష్పం సమర్పయామి॥**

**భావార్థము :** గంధము అయిన తరువాత పుష్పము సమర్పిస్తున్నారు. ఇప్పుడు ఆకాశతత్వము మనలో ఏమి బాధపెడుతున్నాయి అంటే జ్ఞాన, మనో, బుద్ధి, చిత్త, అహంకారములు అనే అంతఃరేంద్రియములు ఈ 'నేను' అనే జీవునికి మహబాధ పెడుతున్నాయి. వాటిని పుష్పముగా చేసి మీకు ఆనందం కలగడానికి నేను సమర్పిస్తున్నాను.

3. **యం : వాయ్వాత్మనే స్పర్శతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**

**శ్రీ గురుదేవాయనమః వాయ్వాత్మకం ధూపం సమర్పయామి॥**

**భావార్థము :** మనలో వుండేటటుపంటి వాయువు మహమమకారానికి స్థానము, ప్రాణాన్ని నిలుపుకోవాల, ప్రాణముతో సుఖపడాలని మనలో ఎక్కువ ఉంటుంది. కాబట్టి వీటినుండి బంధ ముక్తులు కావాలి, అందుకు సమాన వాయువు, వ్యానవాయువు, ఉదాన వాయువు, ప్రాణవాయువు, అపాన వాయువు అనేటటు వంటి పంచప్రాణములను ధూపముగా చేసి మీకు ఆనందము కలగడానికి సమర్పిస్తున్నాను.

4. రం : తేజసాత్మనే రూపతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే

శ్రీగురుదేవాయనమః తేజాత్మకం దీపం సమర్పయామి॥

భావార్థము : అగ్ని తత్వములో పుట్టిన ఐదు జ్ఞానేంద్రియములు, అంటే జ్ఞాన జ్యోతులు అవి వుండే స్థానములు ఏవంటే శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము. ఈ ఐదింట్లో జ్ఞానమనే జ్యోతులు వెలుగుతూ వుంటాయి కాబట్టి వీటిని నేను దీపములుగా చేసి మీకు ఆనందం కలగడానికి సమర్పిస్తాను.

5. వం : అంబాత్మనే రసతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే

శ్రీ గురుదేవాయనమః అంబాత్మకం అమృతనైవేద్యం సమర్పయామి॥

భావార్థము : జల భూతములో పుట్టినటువంటివి విషయేంద్రియములు. అవి మనలో బంధహేతువులై శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే విషయేంద్రియములు జీవుడ్ని నిరంతరము బాధపెడుతున్నాయి. అందువల్ల నాయొక్క విషయేంద్రియములను మీకు అమృత నైవేద్యముగా సమర్పిస్తున్నాను. ఇక్కడ ఆకాశము, వాయువు, అగ్ని జలము, పృథ్వి అనే ఐదు భూతములతో పుట్టినటువంటి గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము. ఈ ఐదు రకాలుగా చేసి సద్గురునకు సమర్పిస్తున్నాను.

6. సం : సర్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే

శ్రీ గురుదేవాయనమః సర్వాత్మకాన్ సర్వోపచారాన్ సమర్పయామి॥

భావార్థము : స్వామి! నా దగ్గర వున్న సకల తన్మాత్రములతో కూడినటువంటి సర్వోపచారములు చేసినాను. ఎట్ల అంటే ధూప, దీప, నైవేద్య, గంధపుష్ప పద్ధతులతో అన్ని మీకు సమర్పించినాను, కాబట్టి కర్పూర మంగళ నీరాజనముగా నన్ను మార్చి మీరు నన్ను లేకుండగా చేయాలిస్వామి అని తనను తానుగా సద్గురునికి సమర్పిస్తారు.

ఈ పంచపూజలు వూరికే చేయలేదు పెద్దలు. అయితే మహత్తరమైన శక్తంతా దీనియందే యున్నది. ఇంతకంటే ఏమర్పిస్తారు. తన్నుతాను అర్పించిన తరువాత ఏమైన వున్నదా అర్పించడానికి. అందుకే అర్పణక్రియ కావాలి. కాబట్టి పెద్దలు మనకు పంచపూజులలో వుండే మహత్తర శక్తిని ఈ విధంగా చెప్పినారు. కాబట్టి మనము భావనా రూపముతో ఈ పంచపూజలు తప్పనిసరిగా చేయవలెను.

# శ్రీ నిజగురు పరంపర ధ్యానము

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశ ఋషిభ్యో, మహద్భ్యో, నమోగురుభ్యోః, సర్వోపప్లవ రహిత
ప్రజ్ఞాన ఘనప్రత్యగర్థో బ్రహ్మై వాహమస్మి అహం పదార్థరహితః

**భావార్థము** : మనము సామాన్యముగా అనుష్టానము చేసేటప్పుడు, గురుపరంపరము చెప్పుకుంటాము. ఎందుకు ఈ విధంగా చెప్పవలసి వచ్చిందంటే, మన అనుభవానికి సంబంధించినటువంటి ప్రపంచమంతా మనము ఎంతో ఘాడంగా ప్రేమించినా, దృఢంగా నమ్ముకున్నా, ఏదో ఒకరోజు ప్రపంచము నుండి మనము విడిపోవడమో, లేక మననుండి అది దూరమై పోవడమో జరుగుతావుంది. అంటే మన పరిధిలో వున్నదంతా అశాశ్వితమని తెలిసినా, సత్యపదార్థమేదైనా వున్నదా? అనేటటువంటి పద్ధతిలో అనుష్టానము చేసినారు మనపెద్దలు. మనకు సృష్టికర్త కంటికి కనిపించడు కాని సృష్టి అయితే కనబడతావుంది. మరి కర్త కనుపించనటువంటి జగత్తును మనము చూస్తువున్నాము.

అయితే కర్త ఎవరు? దీన్ని మనము ఎలా పొందాలి అనే విషయానికి మొదట్లో శ్లోకము "ఓం నమో బ్రహ్మాదిభ్యో" బ్రహ్మాదేవుడు, అంటే బ్రహ్మతత్వము తెలిసినటువంటి పెద్దలు సృష్టి చేసినారు వారికి నా నమస్కారములు. "బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో". ఈ సృష్టి రహస్యములు కనిపెట్టి చెప్పినవాళ్ళు ఎవరు అంటే మన వంశ ఋషులు. వారు సాధించిన నిజధర్మాన్ని రాబోవు తరం వారికి చెప్పాలన్నప్పుడు పరంపరము కావాలి. ఆ పరంపరము ఎలా అంటే "వంశ ఋషి భ్యోమహద్భ్యోనమో గురుభ్యః", అంటే వంశ ఋషులు కనిపెట్టినటువంటి మహతత్వాన్ని మనకు గురువులు పరంపరముగా చెప్తావచ్చినారు. అందువల్ల అటువంటి గురుస్వరూపమునకు నానమస్కారములు.

"సర్వోపప్లవరహిత" సర్వోప అంటే సమీపమున, ప్లవము అంటే అనేక విషయములు. ఆ విషయములు నీలోపలనే పుట్టి నిన్ను అనేక రకములుగా భ్రాంతియనె బంధములో ముంచి అనేక విషయములను ఉత్పత్తి చేస్తుంది.

ఇట్ల ఒకదానివెనుక ఒకటి గుణములు పుట్టి బంధిస్తావుంది. ఇటువంటి విషయములే సర్వోపప్లవము "రహితము" అంటే ఇవన్ని తీసివేస్తే "ప్రజ్ఞానఘన ప్రత్య గర్థోబ్రహ్మైవాహమస్మి". ఈ విషయములన్ని నీవుకాదు. ఇవి నీకు తెలియబడుచున్నవి. నీవు వాటిని తెలుసుకొనె ద్రష్టవు అవి దృశ్యాలు, నీవు దృక్కువు. నీవు త్రికాల బాద్యంగా వుండే కూటస్థ జ్ఞానానివి అని గురువు ఎప్పుడు చెబుతారో, అప్పుడు బ్రహ్మజ్ఞానము వచ్చేస్తుంది. ఏ ప్రజ్ఞాన మయితే అన్నిటికన్నా గొప్పదని తెలిసిందో ఆ బ్రహ్మమే నేనైతిని అని, అనిన తర్వాత అచల ఋషులు వచ్చి "అహంపదార్థరహితః" అనే ఆ నేను లేని బోధ మన పెద్దలు చెప్పినారు. కాబట్టి మనము నిత్యా అనుష్టానము చేసెటప్పుడు తప్పనిసరిగా గురుపరంపరమును చెప్పుకుంటాము.

# లఘుపూజ

**శ్లో॥ బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం జ్ఞాన మూర్తిం,**
**ద్వందాతీతం, గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం,**
**ఏకం నిత్యం, విమలమచలం, సర్వధీ సాక్షిభూతం,**
**భావాతీతం త్రిగుణరహితం, సద్గురుంతం నమామి॥**

**ఈ శ్లోకము యొక్క వివరణ**

**శ్లో॥ బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం జ్ఞానమూర్తిం॥**

**భావార్థము :** 'బ్రహ్మానందం' సద్గురు పరమాత్ములు ఎల్లప్పుడు బ్రహ్మానంద స్వరూపులు. 'పరమసుఖదం' గురువుగారు ఆనందించేటటు వంటి సుఖము ఎటువంటిది? పరమ సుఖము అంటే శాశ్వితమైనటువంటి సుఖము. 'కేవలం జ్ఞానమూర్తిం' అంటే గురువుగారు కేవలము స్వయంప్రకాశ జ్ఞాన స్వరూపులైయున్నారు.

**శ్లో॥ ద్వందాతీతం, గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం॥**

**భావార్థము :** 'ద్వందాతీతం' గురుదేవులు ద్వందములకు అతీతులు అంటే సుఖదుఃఖములకు, పాప పుణ్యములకు మొదలగు ద్వందములకు విలక్షణమై యున్నవారు. 'గగనసదృశం' అకాశమువలె సర్వవ్యాపకమై,

స్వచ్ఛమైయున్నవారు. 'తత్త్వమస్యాదిలక్ష్యం' వేదములయొక్క సారమైన 'ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మబ్రహ్మ అనుమహావాక్యముల లక్ష్యార్థమైనటువంటి వారు సద్గురువులు.

**శ్లో॥ ఏకం నిత్యం, విమలమచలం, సర్వధీ సాక్షిభూతం॥**

భావార్థము : 'ఏకం నిత్యం' గురుదేవులు అద్వితీయులు అంటే ద్వయభావము లేకుండా ఎప్పుడు ఒకే భావంగా వుండేవారు. 'విమలమ చలము' మలినము లేకుండా నిర్మలంగా వుండేవారు. సద్గురువులు అచల స్వభావము కలిగినటువంటివారు. 'సర్వధీసాక్షి భూతం' సర్వప్రాణులందు, సమస్త భూతములందు బుద్ధికి సాక్షిగాయున్న వారు. 'ధీ' అంటే బుద్ధి అని అర్థము.

**శ్లో॥ భావాతీతం, త్రిగుణరహితం, సద్గురంతం నమామి॥**

భావార్థము : 'భావాతీతం' సద్గురుమూర్తి భావములకు, సంకల్పాలకు, వికల్పాలకు, మనోబుద్ధులకు విలక్షణమైనటువంటి వారు. 'త్రిగుణరహితం' గురుదేవులు త్రిగుణములకు అతీతులు, నిర్గుణస్వరూపమై యున్నవారు. 'సద్గురంతం నమామి' అటువంటి సద్గురుమూర్తి స్వాముల వారికి నా నమస్కారములు.

**శ్లో॥ ధ్యానమావాహనం, సింహసనం, పాద్యంతదైవచ॥**

భావార్థము : 'ధ్యానమావాహనం' ఓ గురుదేవా! మీరు రావాలని ధ్యానిస్తున్నాము. 'సింహసనం పాద్యంత దైవచ' అంటే సింహసనమును మీరు అలంకరిస్తే, దైవసామానులైన మీ పాదపద్మములను కడిగి పునీతులవుతాము స్వామి.

**శ్లో॥ అర్ఘ్యమాచమనీయంచ! స్నానం పంచామృతైస్సహ॥**

భావార్థము : 'అర్ఘ్యమాచమనీయంచ' స్వామి మీ హస్తములు, అందమైనటువంటి ముఖ ఆచమానీయము చేయవలెను. 'స్నానం పంచామృతైస్సహ' మీరు పంచామృత స్నానము చేయండి స్వామి. పంచామృతము అంటే చక్కెర, పెరుగు, తేనె, నెయ్యి, పాలు. వీటితో స్నానము చేయండి స్వామి.

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం। యజ్ఞసూత్రం విభూషణం॥

భావార్థము : 'శుద్ధోదకం వస్త్రయుగ్మం' శుద్ధమయిన ఉదకముతో స్నానంచేసి, పట్టు వస్త్రాలు ధరించండి స్వామి 'యజ్ఞ సూత్రం విభూషణం' నిర్మలమైనటువంటి యజ్ఞోపవీతమును, ఆభరణములను ధరించి మీ దివ్యరూపాన్ని దర్శనమివ్వండి స్వామి.

శ్లో॥ విలేపనం చాక్షతాంశ్చ। పుష్పం స్వర్ణవినిర్మితం॥

భావార్థము : 'విలేపనం చాక్షతాంశ్చ' స్వామి శరీరానికి చల్లదనము కోసము శ్రీ గంధాన్ని విలేపనము చేసి అక్షింతలు సమర్పించాలి. 'పుష్పం స్వర్ణ వినిర్మితం' గురుదేవులకు పుష్పములు సమర్పించాలి, ఎటువంటివి అంటే బంగారముతో చేసినటువంటి పుష్పములు సమర్పించాలి.

శ్లో॥ ధూపం దీపంచ నైవేద్యం। పానీయ్యం ఫలమేవచ॥

భావార్థము : 'ధూపం దీపంచ నైవేద్యం' అంటే ధూపము, దీపము మరియు నైవేద్యములు సమర్పించాలి. 'పానీయం ఫలమేవచ' పానీయములు, ఫలములు సమర్పించాలి.

శ్లో॥ తాంబూలం దక్షిణార్తిక్యం। మంత్రపుష్పం ప్రదక్షిణం॥

భావార్థము : 'తాంబూలం దక్షిణార్తిక్యం' గురువుగారికి తాంబూలములు, దక్షిణము, మంగళ హారితి ఇవ్వవలెను. 'మంత్రపుష్పం ప్రదక్షిణం' స్వామికి దక్షిణముగా మంత్రపుష్పాన్ని సమర్పించి, సద్గురువుని చుట్టూ ఆత్మప్రదక్షిణ చేయాలి.

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర। మాయాతుభ్యం నివేదయేత్॥

భావార్థము : 'నమస్కారందేశికేంద్ర' గురుదేవునికి నమస్కారము చేస్తూ దేశికేంద్ర 'మాయాతుభ్యం నివేదయేత్' నేను మీకు నివేదించినటువంటి లఘుపూజ.

శ్లో॥ కృపయా గృహ్యాతాం స్వామిన్। న్యూనాదిక్యం నచింతయా॥

భావార్థము : 'కృపయా గృహ్యాతాంస్వామిన్' మాపై కృపచేత మీరు స్వీకరించండి. ఎందుకంటే పూజ చేసిన తరువాత ఈ క్షమాపణ మంత్రము ప్రతి చోట వుంటుంది. నేను పూజ బాగాచేసినాను, అనే అహంకారము పడకుండా, పూజచేసిన వాడ్ని నేను, చూచినవాళ్లు మీరు, మీకు తెలుసు

ఏమేమి పొరపాట్లు చేసినానో, నాకు మాత్రం తెలియదు. అందులో ఏదైనా పొరపాట్లు వుంటే మీరు మన్నించండి అని అంటారు. ఎందుకు అంటే ఈ క్షమాపణ అనేటటువంటిది చివరకు ఏమి ఎక్కువ తక్కువ వున్నప్పటికి గురువును తృప్తిపరిచెటటువంటి లక్షణము దీనిలోనే వున్నది. ఎందుకు అంటే మనము మంత్రాన్ని ఉచ్చరించెటప్పుడు స్ఫుటముగా పలికివుండము. సేవచేసెటప్పుడు అజాగ్రత్తగా చేసియుంటాము. అందువల్ల నేను చేసిన సేవల్లో ఏవైనా లోపాలు కనబడియుంటే వాటిని మన్నించమని అంటాడు. ఈ విధంగా క్షమాపణ చెప్పవలెను.

శ్లో॥ లఘుపూజా విధింభాగవత కృష్ణ ద్విజన్మనా రచితం।

భావార్థము : 'లఘుపూజా విధింభాగవతకృష్ణద్విజన్మనా రచితం' ద్విజులు అంటే బ్రహ్మణులు, భూసురులు, దేవతలు, కాబట్టి భూసురులైనట్టి ఈ బ్రహ్మణోత్తముడైన శ్రీభాగవత కృష్ణదేశికులు రచించినటువంటి ఈ లఘు పూజవిధానము.

శ్లో॥ శ్రోత్రువక్త్రుణా। మిదం మోక్షకరం పదం।

భావార్థము : శ్రోత్రువక్త్రుణా' అంటే వినెటటు వంటివాడు, చెప్పెటటు వంటి వాడు 'మిదం మోక్షకరంపదం' వీళ్ళిద్దరు కూడా మోక్షస్థితిని, ఆనందాన్ని అనుభవిస్తారు.

# పరిపూర్ణ అచలధ్యానం

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం। ఆగ్నేయే నిర్గుణం తథా
దక్షిణే నిత్యశుద్ధంచ। నైఋత్యే నిరుపద్రవం
పశ్చిమే నిష్కళంచైవ। వాయవ్యేచ నిరంజనం
ఉత్తరేచ నిరాకాశ। మీశాన్యే నిర్మలో భవేత్
ఊర్ధ్వమేవ నిరాకారం। అధశ్చ నిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర। అచలోయం సనాతనః॥

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం। ఆగ్నేయే నిర్గుణంతథా॥

భావార్థము : 'పూర్వమేవ నిరాలంబం' తూర్పు దిక్కున మీరు ఆలంబనము లేనివారుగా వున్నారు. అంటే ఏ ఆధారము లేకుండా, మీరే

అన్నిటికి అధారభూతులై యున్నారు. 'ఆగ్నేయే నిర్గుణం తథా' ఆగ్నేయములో నిర్గుణ స్వరూపులై, గుణరహితముగా వున్నారు.

శ్లో॥ దక్షిణే నిత్య శుద్ధంచ। నైఋత్యే నిరుపద్రవం॥

భావార్థము : 'దక్షిణే నిత్యశుద్ధంచ' దక్షిణ దిశయందు నిత్యము శుద్ధంగా వుండారు. ఎందుకు దీనికి ఈ విధంగా చెప్పినారు అంటే చైతన్యమైన, నిరాకార స్వరూపమైన గురుస్వరూపము ఎప్పుడు కూడా శుద్ధంగానే వుండాలి. సముద్రము ఎప్పుడు శుద్ధంగా వుంటుంది. ఎందుకు అంటే దాంట్లో ఏ మలినము వేసినా తిరిగి మళ్లా బయటికి వస్తాది. అట్లనే చైతన్య స్వరూపమందున జగత్తు కనబడినా, జగత్తు సృష్టి, స్థితి, లయలు జరుగుతావున్న, అది నిత్యముగా, శుద్ధముగా, సాక్షిగా వుంటుంది. 'నైఋత్యే నిరుపద్రవం' నైఋతిలో చూడగా నిరుపద్రవం' ఉపద్రవములు అంటే మానసిక కల్లోలములు, శరీరక రుగ్మదములు, ఇవన్ని మనకు అనేకములుగా వున్నవి. కాని అక్కడ ఈ ఉపద్రవములు ఏవి లేవు.

శ్లో॥ పశ్చిమేనిష్కళంచైవ। వాయువ్యేచ నిరంజనం

భావార్థము : 'పశ్చిమే నిష్కళంచైవ' పడమటి ప్రక్క నిష్కళమై యున్నది. మనకు నిద్రావస్థలో కళ ఎప్పుడు వూరికే వుంటాది. స్వప్నము రావలంటే మొట్టమొదట బల్బు వేసినట్టుగా స్వప్నదృశ్యాలు కనబడేకి ఒక వెలుగు పుట్టాది. ఆ వెలుగు నుండి మనకు దృశ్య కోటి అంతా వస్తాది. పశ్చిమ దశలో కళలేకుండా నిష్కళమై యుంటావు. 'వాయువ్యేచ నిరంజనం' వాయువ్య స్వరూపములో సాక్షాత్తు పరమాత్మ స్వరూపమై వుండావు.

శ్లో॥ ఉత్తరేచ నిరాకాశ। మీశాన్యే నిర్మలోభవేత్॥

భావార్థము : 'ఉత్తరేచ నిరాకాశ' ఉత్తరదిశయందు 'నిరాకాశ' అకాశమనె ఆవరణ లేకోకుండ వుంటావు. 'మీశాన్యేనిర్మలో భవేత్' ఈశాన్యదిశయందు మీయొక్క స్వరూపము నిర్మలముగా వుంటాది.

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం। అధశ్చ నిర్వికారకః॥

భావార్థము : 'ఊర్ధ్వమేవ నిరాకారం' పైన, ప్రక్క నిరాకార స్వరూపముగా వుంది. 'అధశ్చ నిర్వికారకః' క్రింద ప్రక్కన ఏ వికారములు లేకుండా వుంది.

శ్లో॥ అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతన॥

భావార్థము : 'అంతర్బహిశ్చ సర్వత్ర' లోపల, వెలుపల, ఇప్పుడు చెప్పినటువంటి ఎనిమిది దిక్కులు సర్వత్ర కూడా చలనము లేకోకుండ వుండేటటువంటిది మీ స్వరూపము అని చెప్పి 'అచలోయం సనాతన' సనాతనము నుండి ఈ అచలమే యున్నది అనిచెప్పి, గురువు యొక్క నిజస్వరూపాన్ని, నిర్గుణ స్వరూపాన్ని మనము బాగా ధ్యానించాలి అని పెద్దలు మనకు చెప్పినారు.

# పరా పూజ

మనము గురువుగారికి సాకార దృష్టితో వున్నప్పుడు చేసే పూజ షోడశోపచార పూజలు. ఇక్కడ వస్తువులు పెట్టి భౌతికంగా చేసేటటువంటి పూజ. ఇక జ్ఞానముతో పూజ ఏలా చేయాలి? గురువుగారి సాకార రూపానికన్నా నిరాకార రూపాన్ని అర్థం చేసుకున్న శిష్యుడు జ్ఞానపూజ ఏవిధంగా చేస్తాడు? అనే దానికి పరాపూజ పెట్టినారు. జ్ఞాన పూజ అన్నా, పరాపూజ అన్న రెండు ఒక్కటే, పరా అంటే జ్ఞానము అని అర్థము. ఇప్పుడు గురువుగారు సాకారముతో వచ్చినారు. పాద్యము, అర్ఘ్యము, అచమనీయము, పంచామృతము, శుద్ధోదక స్నానము, వస్త్రయుగ్మము, యజ్ఞోపవీతము, ఇవన్ని పెట్టినాము. స్థూలంగ ఇవన్ని మనకు అవసరమే, గురువుగారికి అవసరమే. కాని గురువుగారు ఒకచోట వున్నారు. మనము మరియొక చోట వున్నాము, అప్పుడు నిరాకార స్వరూపానికి శిష్యుడు పూజ ఎట్లు చేయాలి? అనేదానికి ఈ పరాపూజ పెట్టినారు.

శ్లో॥ పూర్ణస్యావాహనం కుత్ర సర్వాధారస్యచాసనం॥

భావార్థము : 'పూర్ణస్యావాహనం కుత్ర' పూర్ణంగా వుండే వాళ్ళకు ఆవాహనం అంటే రండి స్వామి అని ఎట్ల చెప్పడము. ఇప్పుడు గురువు ఒక ఊరిలో, మనము ఒక ఊరిలో వుంటే మీరు రండి స్వామి పూజ చేయాలి అని పిలుస్తాము. అయితే అంతట నిండిన వస్తువును ఎట్ల పిలుస్తాము. మరి ఏ విధంగా పూజ చేయాలి? అయ్యా! మీరు ఈ సృష్టి అంతా నిండి నిబిడీకృతంగా పూర్ణంగా వుండారు అని తెలుసుకోవడమే ఆవాహనము చేయడం.

'సర్వాధారస్యచాసనం' సర్వానికి అధారంగా వుండేవారికి ఆసనము ఎలా వేసేది. జగత్తుకే మీరు ఆధారముగా వుండారు. మీకంటు అధారమేమి లేదు. కాబట్టి అన్నిటికి ఆధారంగా వుండే మీకు నేను సింహాసనము ఎలా వేసేది. అందువల్ల మీరే అన్నింటికి ఆధారంగా వుండారనే తెలుసుకోవడమే మీకు సింహాసనము వేయడము.

శ్లో॥ స్వచ్ఛస్యపాద్య మర్ఘ్యంచ శుద్ధస్యాచమనంకుతః॥

భావార్థము: 'స్వచ్ఛస్యపాద్యమర్ఘ్యంచ' అంటే గురువు గారికి పాదములు, చేతులు కడుగుతాము. ఇప్పుడు గురువు బాటసారియై నడిచి వచ్చినప్పుడు ఎండకు దుమ్ము, ధూళి పట్టి, శరీర అవయవములన్ని కూడా చమట్లతో వుంటాయి. కాబట్టి గురువుగారికి పాద ప్రక్షాళము, హస్త ముఖ ప్రక్షాళము చేస్తాము. ఈ మలినములు అంతా భౌతికమునకే తప్ప ఆత్మ స్వరూపానికి వుండదు. మిమ్మల్ని శుద్ధ స్వరూపులు అని తెలుసుకోవడమే మిమ్మల్ని స్నానము చేయించినట్లు. 'శుద్ధస్యాచమనంకుతః'. అయన ముఖము ఎటువంటిది అంటే అశుద్ధమైనటువంటి దానిని నిత్యము శుద్ధాన్ని ప్రసాదించేది గురుస్వరూపము: కాబట్టి అట్టి మీ స్వరూపానికి నేనెట్లు ముఖం కడిగేది. అందువల్ల మీరు శుద్ధంగా వుండారని తెలుసుకోవడమే అచమనీయము.

శ్లో॥ నిర్మలస్యకుతస్నానం, వస్త్రం విశ్వోదరస్యచ॥

భావార్థము : 'నిర్మలస్యకుతస్నానం' నిర్మలునికి ఎట్ల స్నానము చేయించేది. మలినము వుంటే స్నానం చేయించాలి, మలినము లేని శుద్ధ చైతన్య స్వరూపుడాయన. స్థూల శరీరమునకు దుమ్ము ధూళి మలినమవుతాయి. సూక్ష్మ శరీరమునకు కామక్రోధాలు, రాగద్వేషాలు మాలిన్యమవుతాయి. కారణ శరీరమునకు అజ్ఞానము, అంధకారము మాలిన్యమవుతాయి. మహాకారణ శరీరానికి సృష్టి వ్యామోహావే మాలిన్యమవుతాయి. ఈ మాలిన్యములు అన్ని దాటినటు వంటి శుద్ధ చైతన్య స్వరూపులు. కాబట్టి మీరు శుద్ధంగా వుండారు అని తెలుసుకోవడమే నేను మీకు స్నానము చేయించడము. 'వస్త్రంవిశ్వోదరస్యచ' ఈ విశ్వమంతా ఆయన ఉదరములో వుంది. పదునాల్గు భువనములు మీ కుక్షి యందు అంటే కడుపులో ఉన్నాయి స్వామి. మీకు నేను బట్ట తీసుకొని అంగి (షర్ట్)

ఎట్ల కుట్టించేది. మీకు పంచె ఎట్ల కట్టించేది. మీరు విశ్వానికే ఆధారంగా ఉండే వస్త్రానివి. అని భావించడమే నేను మీకు వస్త్రములు సమర్పించినట్లు.

శ్లో॥ నిరాలంబ స్యోపవీతం రామస్యాభరణంకుతః

భావార్థము : 'నిరాలంబ స్యోపవీతం' మీకు ఇంకొక ఆలంబనలేదు. ఒక ఆధారము లేదు. మీరే అన్నిటికి ఆధారము అయివున్నారు. మీకు యజ్ఞోపవీతం వేయమని చెప్పినారు. ఎలా వేయాలి? ఎందుకంటే మీరే సూత్రధారులు. మీకు ఎట్ల ఇంకొక సూత్రము తెచ్చి వేసేది. సూత్రమే మీరు అయినప్పుడు, మీకు సూత్రము వేయడములో అర్థమేముంది. కాబట్టి ఆలంబన లేని వారుగా మిమ్మల్ని అర్థం చేసుకోవడమే మీకు యజ్ఞోపవీతం వేయడము. 'రామా స్యాభరణం కుతః' అంటే సృష్టినే మీరు రమిస్తున్నారు. మీకు 84 లక్షల జీవరాసులన్ని కూడా ఆభరణాలే, కిరీటాలు, కుండలాలు, దండలు అన్ని కూడా మీవే, అన్నిటిని రమిస్తున్నారు మరియు రమించే వస్తువులలో మీరున్నారు. కాబట్టి మీకు 'రామ' అని 'సోహం' అని, 'గురుదేవ' అని పేర్లు వచ్చినవి. అందువల్ల నేను మీకు సర్వాభరణములు ఇవ్వలేను. అన్ని మీయందే వున్నావని భావించడమే మీకు ఆభరణములు వేయడము.

శ్లో॥ నిర్లేపస్యకుతో గంధః పుష్పం నిర్వాసనస్యచ॥

భావార్థము : 'నిర్లేపు' అంటే మనము గంధము విలేపనము ఎప్పుడు చేస్తాము. స్వామికి ఉష్ణమైనప్పుడు, శైత్యోపచారముగా గంధము రాస్తాము. ఆయన ప్రపంచానికి ఆధారమైనట్టి అగ్నిభూతాన్ని ఉదరములో, జఠరాగ్ని స్థానములో పెట్టుకున్నారు. మధ్య భూతము అగ్నిభూతము. నేత్రములో అగ్ని, హృదయములో అగ్ని, పాదములలో అగ్ని. ఇన్ని రకాలుగా అగ్నులతో ఉన్నవారికి ఎంత గంధము పూయాలి. ఎంత గంధము పూసినా తక్కువే. అయినా వాటితో మీరు శైత్యోపచారము పొందేవారు కారు. మీతోనే అవి పొందాలి కాబట్టి ఏ గంధము యొక్క లేపన లేనివారు 'నిర్లేపుడని' భావించడమే మీకు గంధము పూయడము. 'పుష్పం నిర్వాసనస్యచ' ఈ సృష్టిలో ఉండేటటువంటి మొత్తము పుష్పాలన్నిటికి మీరె కారణమైయున్నారు. పుష్పాలు వాసన అందించేది మీకు ఆనందం కలిగించడానికి కాదు. ఆ పుష్పాలకే మీరు ఆనందం కలిగిస్తున్నారు. కాబట్టి మీకు ఎట్లు పుష్పాలు తెచ్చి

పెట్టెదయ్యా. అందువల్ల 'నిర్వాసనస్యచ' వాసనలేని స్థానమును పుష్పంగా భావించమే మీకు పుష్పాలు సమర్పించడము.

**శ్లో॥ నిర్గంధస్యకుతో ధూప। స్వప్రకాశస్యదీపకం॥**

**భావార్థము :** 'నిర్గంధస్యకుతో ధూప' మనము నానా రకాలు అత్తరు, పన్నీరు, పునుగు, జవ్వాజి, మంచి విలువైనటువంటి సాంబ్రాణీ కడ్డీలు, ఊదిన కడ్డీలు పెట్టి, స్వామి మీరి సువాసన ద్రవ్యాలన్ని తీసుకొండి అని చెప్తాము. అయితె వారి దగ్గరుండే వాసన ఎటువంటిది అంటే ఏ వాసనలకు అంటనటువంటిది. అన్నిటికి తాను వుంటేనే ఇవన్నియున్నవి. కాబట్టి నేను మిమ్మలని నిర్గందునిగా భావించడమే మీకు నేను ధూపము వేయడము, స్వప్రకాశస్యదీపకం' నేను ముట్టించే దీపానికి ప్రమిద ఉండాల, నూనె వుండాల, వత్తి వుండాల, మరి వీటన్నిటిని ముట్టించడానికి అగ్ని కావాల. ఇవన్ని వుంటే కొంతకాలము అది ప్రకాశిస్తుంది. కాని మీరు అటువంటివారు కారు కదా! స్వయం ప్రకాశకులు, అంటే ఏ ఆధారము లేక ప్రకాశించేవారు. ఈ జ్ఞాన జ్యోతి అనెటటువంటి దాన్ని బాగ అర్థం చేసుకుంటే దీపం స్వప్రకాశమైనటువంటిది. అందుకు స్వయం ప్రకాశ స్వరూపుడని భావించడమే మీకు దీప దర్శనం చేయడము.

**శ్లో॥ నిత్య తృప్తస్యనైవేద్యం నిష్కామస్యఫలం కుతః॥**

**భావార్థము :** 'నిత్యతృప్తస్యనైవేద్యం' మనము నైవేద్యమును గురువుగారికి స్వామి! ఆలస్యమయింది భోంచేయండి అని అంటున్నాము. అయితె ఈ సృష్ఠింతా ఆయనకు ఆహరమే కాబట్టి ఆయన నిత్యము తృప్తిగానె వుంటారు. ఆయనే 84 లక్ష జీవరాశులకు ఆహారము వేయాలెగాని ఆయనకు ఆహారము వేసెటటువంటి వారు ఎవరున్నారు. కాబట్టి మిమ్ములను ఆవిధంగా భావించడమే మీకు నైవేద్యము పెట్టినట్లు 'నిష్కామస్యఫలంకుతః' కామనే లేదు, కోరికయే లేదు, అటువంటి స్వామికి అరటిపండు తిను స్వామి, ఆపిల్ పండు తినుస్వామి, ద్రాక్షపండు తినుస్వామి అని మనము అంటున్నాము. కామనె లేనివారికి, ఫలానా పండు తినాలి అనె కోరికనే లేని వారికి నేను ఫలాలను ఎట్ల ఇచ్చేది. ఫలములను పుట్టించే వారు, మీ నుండే పుట్టవల్సిందే ఫలాలు. కాబట్టి మీరు నిష్కాములని తెలుసుకోవడమే మీకు ఫలహారము పెట్టడము.

**శ్లో॥ తాంభూలంచ విభోకుత్రః నిత్యానందస్య ధక్షిణా॥**

భావార్థము : 'తాంబూలంచ విభోకుత్ర' మనము గురువుగారికి తాంబులము ఇస్తాము. అంటే తాంబులము మన దగ్గరవున్నట్లు, గురువుగారి దగ్గరలేనట్లుగా దలచి ఇస్తున్నాము. ఆయన విభుడు అని తెలిసిన తర్వాత, తాంబులమునకు ఆయనే కర్త అని తెలిసిన తర్వాత మనము తాంబులము ఇవ్వడానికి సాధ్యమా! కాదు కాబట్టి ఈ సృష్టి మొత్తము మీనుండే వస్తాదని భావము కలగడమే మీకు తాంబులము ఇవ్వడము. 'నిత్యానందస్య దక్షిణాః' ఆత్మ స్వరూపానికి దక్షిణముతో పని ఏముంది. దేహ స్వరూపమైన గురువుకు అయితె చార్జీలు కావాలి, సంసారముంటుంది, వాళ్ళకు వచ్చి, పొయ్యేచోటు అంత కర్చు వుంటుంది, భక్తులతో వ్యవహరముంటుంది కాబట్టి దక్షిణకావాల మరి పరమాత్మ స్వరూపానికి బంధాలు, సంబంధాలు ఏమి లేవు కదా! మరి దక్షిణ ఎందుకు? కాబట్టి ఎప్పుడు ఆనంద స్వరూపులే, దుఃఖము, బాధలు లేనట్టి మీ యొక్క స్వరూపాన్ని నిజముగా విచారిస్తె బ్రహ్మానంద స్వరూపులు. అందువల్ల మిమ్ములను నిత్యానందులుగా భావించడమే మేము దక్షిణ ఇవ్వడము.

**శ్లో॥ స్వయం ప్రకాశమానస్య కుతోనీరాజ నాధికం॥**

భావార్థము : 'స్వయం ప్రకాశమానస్య కుతో నీరాజ నాధికం' మంగళ హారతి ఇవ్వాల అని అనుకుంటాము. అయితె మీరు స్వయం ప్రకాశకులు. మీకు ఎవ్వరి దృష్టి, దిష్టి తగలదు. స్వయంప్రకాశానికి మంగళము అక్కర్లేదు. అపవిత్రమైన దేహాలు, రోగభూయిష్టమైనవి, జననమరణాలు, భయభ్రాంతులున్నచోట, మంగళము కలగాల, శుభము కలగాల అని కోరికలుంటాయి. కాని అది ఎల్లప్పుడు మంగళకరంగా ఉంటే అటువంటి దానికి నీవు మంగళము కోరెదేముంటుంది. అందువల్ల ఈ సృష్టిలో మీరు అందరికంటే శుభకరమైన మంగళకరుడవని భావించడమే మీకు నేను నీరాజనం ఇవ్వడము.

**శ్లో॥ ప్రదక్షిణం మనంతస్య అద్వితియస్యకాస్తుతి॥**

భావార్థము : 'ప్రదక్షిణం మనం తస్య' అనంతానికి నేను ప్రదక్షిణం చేయగలనా? అంతము వుంటే ఇట్ల ఈ బ్రహ్మాండము వుంది దీని చుట్టు

తిరగాల, లేదా ఒక దేవస్థానముంది, దాని చుట్టు తిరగాల, ఒక క్షేత్రము వుంటే దాని చుట్టు తిరగాల అనేది వుంటుంది. మీరు అనంతముగా ఉన్నారు, కాబట్టి మీకు ఎలా ప్రదక్షిణము చేసేది. అందువల్ల అనంతమైన మీ స్వరూపాన్ని తెలుసుకున్న తరువాత నేను మీకు ప్రదక్షిణ నమస్కారము చేయలేను. అనంతునిగా మిమ్మల్ని భావించడమే మీకు నేను నమస్కారములు చేయడము. 'అద్వితీయస్యకాస్తుతి' మీరు నేను రెండు లేవు కదా! మీ కృప చేత నేనేమీరైతిరి, మీరే నెనైతిని, ఇప్పుడు నేను ప్రక్కన వుంటే గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు, గురుర్దేవో మహేశ్వరా అని అనొచ్చు, ఆ వస్తువును నన్నుగా చెప్పినప్పుడు, నేను మీరుగా అయినప్పుడు రెండు ఒకటైనప్పుడు స్తుతి ఎట్ల జరుగుతుంది. మిమ్మల్ని నేను ఏమని పొగుడుతా, కాబట్టి ఇద్దరి స్వరూపాలు ఒక్కటి అని భావించడమే మిమ్మల్ని స్తుతించడము.

**శ్లో॥ అంతర్బహిశ్చపూర్ణస్య। కథముద్వాసనం భవేత్**

భావార్థము : 'అంతర్బహిశ్చపూర్ణస్య' లోపల బయట అనకుండ పరిపూర్ణంగా వుండే మీకు, మీరు వూరికి వెళ్ళిరండి స్వామి అని ఎట్ల చెబుతాను. 'కథముద్వాసనంభవేత్' ఉద్వాసన ఎలా పలికేకి అవుతుంది. కాబట్టి అంతర్బహిస్సులలో నిండివుండావని తెలియడమే మీకు మేము ఉద్వాసన చెప్పడము.

**శ్లో॥ ఇయమేవ పరాపూజా। సర్వావస్థాసు సర్వదా**
**ప్రేమబుద్ధ్యాతు సర్వేసో। మనోదేవో నివేశయేత్॥**

భావార్థము : 'ఇయమేవ పరాపూజా సర్వావస్థాసు సర్వదా' ఈ జ్ఞాన పూజను సర్వకాల సర్వావస్థయందును 'ప్రేమ బుద్ధ్యాతు' అంటే ప్రేమ బుద్ధాత్ 'సర్వేసో' సర్వేశ్వరునికి, 'మనోదేవో నివేశయేత్' మనస్సుతో ఈ పూజవిధానమును అర్థము చేసుకొని నివేదిస్తె, అటువంటి వారు ఏమి పొందుతారు అంటే

**శ్లో॥ ఏషామజ్ఞాన జీవానాం। సమస్తారిష్ట శాంతయే**
**యద్యబోద్ధవ్యమఖిలం। తత్తద్భక్త్యాబ్రవీమ్యహం॥**

భావార్థము : 'ఏషామజ్ఞాన జీవానాం' ఈ జనన మరణములతో కూడుకున్నటువంటి, అజ్ఞాన జీవన మనేటిదాని యందున, ఈ జనన మరణాలు, అరిష్టములు తొలగిపోయి 'సమస్తారిష్ట శాంతియే' అరిష్టము లన్నిపోయి శాంతి స్థితిని పొందుతాడు. ఏవరు? 'యద్య బోద్ధవ్యమఖిలం,

తత్త్వదృక్త్వాద్రవీమ్యహం' ఇది ఎవరైతె సర్వమును తెలుసుకుని చెప్పగలడో, అటువంటి భక్తుడు ఇటువంటి నిజస్థితిని పొందుతాడు అని. ఇది పరాపుజకు ఫలశృతి. పరాపూజ చెస్తె ఏమి కలుగుతుంది అన్నప్పుడు ఈ నిజార్థములను భావించి ఎవరైతె భావములతో ఈ జ్ఞాన పూజ చెస్తారో వాళ్ళకు ఈపైన చెప్పెనటువంటి అరిష్టములు తొలిగిపోయి నిజమైనటువంటి స్థితి కలుగుతుంది. ఇది ఈ పరాపూజయొక్క విధానము, పూర్ణసిద్ధి.

శ్లో॥ **బింధు మధ్యేగురోర్శిష్యం। దృష్ట ద్రాష్టాంతబోధకం**
**ద్వాదశీ షోడశీమంత్రం। జపతే జన్మరహితః॥**

భావార్థము : 'బింధు మధ్యే గురోర్శిష్యం' ఎరుక అంటే తెలివి అనె బింధు మధ్యములో గురువు శిష్యులు ఇద్దరు కలసి విచారించినారు. ఏవిధంగా 'దృష్టద్రాష్టాంతబోధకం' దృష్టముల చేతను ద్రాష్టాంతముల చేతను ఈ బోధను విచారించినారు. 'ద్వాదశీ షోడశీ మంత్రం' గురుశిష్యులు ఇద్దరు విచారించే చివరి విచారము ద్వాదశీ షోడశీ విచారములు. ద్వాదశీ అంటే పరిపూర్ణమైన పరబ్రహ్మ స్వరూపము ఇట్టిదని నిరూపించేది. షోడశీ అనగా సృష్టికి మూలకారణమైన వస్తువు అంటే నేను అనేటటువంటి ఎరుక యొక్క నిజస్థితిని తెలియజేసేది. 'జపతె జన్మరహితః' ఈ మంత్రములను అంటే ద్వాదశీ షోడశీ మంత్రములను ఎల్లప్పుడు జపించడము వల్ల గురు శిష్యులిద్దరికి కూడా జన్మరహితము అవుతుంది.

# ద్వాదశాక్షరి మహామంత్రము

**అస్యశ్రీ ద్వాదశాక్షరి మహామంత్రస్య। అచల ఋషిః। అవి నా**
**శశ్చందః। అభవోదేవతా। అమృతం బీజం। అప్రమేయా**
**శక్తిః। అయమాత్మా తత్వమస్యాది జ్ఞానరహితం కీలకం।**
**అఖిలకాలేషు పరిపూర్ణమస్తి। మాయాసహిత మేతత్ప్రపంచా**
**దికం నాస్తితి నిశ్చయ సిద్ధ్యార్థం ద్వాదశాక్షరి మహామంత్రజపం కరిష్యే॥**

భావార్థము : ద్వాదశాక్షరి మహామంత్రమును ఎందుకు జపిస్తున్నాను అంటే ఇదిగో ఈ రహస్యము తెలుసుకోవడానికి, ద్వాదశాక్షరి మహామంత్ర మునకు 'అచల ఋషిః', ఋషి - 'అవినాశశ్చందః' అంటే నాశనము లేనిదే దీనికి వేదము. చందస్సు అంటే వేదము. 'అభవో దేవత' భవము అంటే

పుట్టుక, అభవము అంటే పుట్టుకలేనిది. అంటే పుట్టుక లేకుండ స్వతసిద్ధమైన వస్తువే దానికి దేవత. 'అమృతం భీజం' అంటే మృతము లేకుండా వుండడమే దానికి భీజం. 'అప్రమేయ శక్తిః' ఎవరి ప్రమేయము లేకుండా, ఏ దానికి అంటకుండా వుండేదే దాని యొక్క శక్తి. 'అయమాత్మతత్వమస్యాది జ్ఞాన రహిత కీలకం' ఆ వస్తువును ఎలా సేవించాలి, ఎలా దాన్ని అనుభవానికి తెచ్చుకోవాలి అంటే, అయమాత్మ బ్రహ్మమని ఎద్వైతె అంటుందో, అదిలేనటువంటిది పరిపూర్ణము. ఎటువంటి వికారములు చెందనిదే ఆ పరిపూర్ణము, అనేటి భావము చేత దాన్ని కీలకం చేసారు. 'అఖిల కాలేషు పరిపూర్ణమస్తి' అంటే అన్ని కాలములలో కూడా పరిపూర్ణము వుంటుంది. 'మాయాసహితమేత త్ర్పపంచాదికం నాస్తితి' మాయతో కూడిన ఈ ప్రపంచము లేనిదనే స్థితిని పొందాలి. 'నిశ్చయసిద్ధ్యర్థం' అంటే ఇది నిశ్చయము అని తలచితే నీవు సిద్ధిని పొందుతావు. ఎప్పుడు అంటే 'ద్వాదశాక్షరి మహామంత్రజపం కరిష్యే' ద్వాదశాక్షరి మహామంత్రమును శ్రద్ధగా జపిసై సిద్ధ్యార్థము లభించును.

మంత్రమునకు కరన్యాసము, హృదయాదిన్యాసము (అంగన్యాసము), ధ్యానము ఈ మూడు వుంటాయి. మంత్రాధి దేవత నిర్గుణమైనటువంటి పరబ్రహ్మము. ఆ నిర్గుణ పరబ్రహ్మమునకు కరచరణాది అవయవములను కల్పన చేస్తారు. కల్పన చేసేటటువంటిది ఈ కరన్యాసము. ఇప్పుడు హస్తమునకు ఐదువ్రేల్లు వున్నవి. ఐదు వ్రేళ్ల మీద న్యాసముచేసి చూపించు కొనుట, పరబ్రహ్మమంత్రానికి ఇది ఫలాన అంగమని నిరూపిస్తుంది అందుకు,

# అథకరన్యాసము

| | | |
|---|---|---|
| ఏతన్మిధ్యా | = | అంగుష్టాభ్యాం నమః |
| శుద్ధవియత్ | = | తర్జనీభ్యాం నమః |
| కించిన్నాస్తి | = | మధ్యమాభ్యాం నమః |
| ఏదన్మిధ్యా | = | అనామికాభ్యాం నమః |
| శుద్ధవియత్ | = | కనిష్ఠకాభ్యాం నమః |
| కించిన్నాస్తి | = | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

ఆ దేవునకు కరములను కల్పించుట, అందుకే విరాట్ పురుషునకు నాలుగు చేతులు పెడతారు. ఎండ కాలము, గాలి కాలము, వాన కాలము, చలి కాలము. ఈ నాలుగు కాలములు ఆ విరాట్ పురుషునకు నాలుగు చేతులు. మంత్రమునకు అంగుష్ఠం మొదలు కరతలకరపృష్ఠాభ్యాం నమః, వరకు, 'కర పృష్ఠాభ్యాం' అంటే వ్రేళ్ళ వెనక భాగము అని అర్థము. మొత్తము అంతా కలసి మంత్రమునకు కరన్యాసము చేసినారు.

ఇక దీనికి అంగములు కల్పిస్తారు. అంటే హృదయాదిన్యాసము. అది ఎట్ల

# హృదయాదిన్యాసము

| | | |
|---|---|---|
| ఏతన్మిథ్యా | = | హృదయాయ నమః |
| శుద్ధవియత్ | = | శిరసేస్వాహ |
| కించిన్నాస్తి | = | శిఖాయై వషట్ |
| ఏతన్మిథ్యా | = | కవచాయ హుం |
| శుద్ధవియత్ | = | నేత్రత్రయాయ వౌషట్ |
| కించిన్నాస్తి | = | అస్త్రాయఫట్ |

ఇప్పుడు అంతా తయారయినది.

ఏతన్మిథ్యా అనెటటువంటి దానికి హృదయము

శుద్ధవియత్ అనెటటువంటి దానికి శిరస్సు

కించిన్నాస్తి అనెటటువంటి దానికి శిఖ

అట్లె మరి రెండవసారి అనేదానికి

ఏతన్మిథ్యా అనేది కవచము

శుద్ధ వియత్ అనేది నేత్రము

కించిన్నాస్తి అనేది అస్త్రా ఫట్

ఈ విధంగా కరన్యాసము, హృదయాదిన్యాసము చేసి ఆ దేవుని యొక్క స్వరూపాన్ని ధ్యానించాలి.

**శ్లో॥ ద్రష్టదర్శన దృశ్యాదిసహిత। అహం పదార్థరహితః।**
**భూర్భువస్సువరోమితి దశ దిగ్బంధః॥**

ద్వాదశాక్షరి మంత్రమునకు కరన్యాసము, అంగన్యాసములు అయిన తరువాత, ఇక దేవతలను ఎందుకు ధ్యానిస్తాము అనె ఉద్దేశమును మొట్టమొదట ప్రకటపరచినారు.

**శ్లో॥ ద్రష్టదర్శనదృశ్యాది సహిత, అహంపదార్థ రహితః॥**

**భావార్థము :** 'ద్రష్టదర్శన దృశ్యాది సహిత' అంటే ద్రష్ట, దర్శన, దృశ్యాది సహితముగా 'అహం పదార్థ రహితః' ఏద్వైతె నేను అని పలుకుతావుందో అది రహితము అయ్యేకొరకు

**శ్లో॥ భూర్భువస్సువరోమితి దశ దిగ్బంధః**

**భావార్థము :** 'భూర్భువస్సువరోమితి' భూలోకము, భూవర్లోకము, సురలోకము అని ఈ మూడు లోకముల యందును 'దశదిగ్బందః' అష్టదిక్కులు కాకుండా లోపల వెలుపల కూడా మొత్తము పది దిక్కులలో దాని యొక్క స్వరూపము నాకు సిద్ధించు గాక, అని ధ్యానము చేస్తారు.

# అథ ధ్యానము

**శ్లో॥ అచలమఖిలంచాద్యం। సర్వలోకేషు పూర్ణం।**

**భావార్థము :** 'అచలమఖిలంచాద్యం' అచలమనేటి ఆ పరిపూర్ణ పరబ్రహ్మము ఎక్కడ చూచినా వుంది. 'సర్వలోకేషు పూర్ణం' సర్వలోకము లందు ముల్లు గ్రుచ్చేకి సందులేకోకుండా పరిపూర్ణముగానున్నది.

**శ్లో॥ సర్వాతీతం। స్వానుభూతావగమ్యం॥**

**భావార్థము :** 'సర్వాతీతం' మనకు కనబడేటటువంటి పంచభూతాలు, ఉపరిభూతములైన అవ్యక్తము, మహత్తు, మహదాంకారము, అనెటటువంటి ప్రకృతులు, అవిధంగానే దీనికి జీవేశ్వర్ల రూపకంగా వుండేటటువంటి ఎరుక పరమితి ఎంత వుందో, దానికి అతీతమైనది. 'స్వానుభూతావగమ్యం' స్వానుభూతితో పొందేటటువంటిదికాదు. అది అగమ్యము, గమ్యమును చేరే స్థానము కాదు.

**శ్లో॥ సర్వాభాద్యం। సర్వకర్తృత్వ శూన్యం॥**

**భావార్థము :** 'సర్వాభాద్యం' సర్వమునకు అభాద్యము ఏ దానికి భాద్యత వహించదు. 'సర్వకర్తృత్వశూన్యం' కర్తృత్వము, మంతృత్వము, ఏతృత్వం, భోక్తృత్వము అనెటటువంటి క్రియలు ఎరుకనందున వున్నవి. అందుకు

సర్వాజ్ఞత్వాది క్రియలచేత ఈశ్వరుడు కర్తగాను. అట్లనే కించిత్ జ్ఞాత్వాది గుణములచేత జీవుడుగాను, ఆవిధంగానె ఈ సృష్టిలో అష్టదిక్పాదులు, అష్టపురములకు కర్తలుగాను, త్రిమూర్తులు ముల్లోకములకు కర్తలుగాను చెప్పబడుతారు. కాని ఇట్ల ఏ దానికి కూడా కర్తృత్వం వహించదు.

**శ్లో॥ సర్వావేద్యం। సర్వరహితం నమామి॥**

**భావార్థము :** 'సర్వావేద్యం' ఏదాని చేత పొందదగినదికాదు. 'సర్వరహితం నమామి' ఈ సర్వములేనటువంటి నిజమైన పరిపూర్ణము, అటువంటి మీకు నా నమస్కారము.

**శ్లో॥ అవాచ్యం, హ్యాఖండం। హ్యాలక్ష్యం హ్యాబాధ్యం॥**

**భావార్థము :** 'అవాచ్యం' ఇది వచించేకి వీలు లేనిది. 'హ్యాఖండం' ఖండములుగా కానటువంటిది. 'హ్యాలక్ష్యం' లక్ష్యసిద్ధి పొందేదికాదు. 'హ్యాబాధ్యం' నీకంటు వేరుగా, దూరంగా వుండేటటువంటిది కాదు.

**శ్లో॥ హ్యాసంగం, హ్యావేద్యం। హ్యాచింత్యం హ్యారూపం॥**

**భావార్థము :** 'హ్యాసంగం' సంగము లేనటువంటిది. 'హ్యావేద్యం' కొన్ని వేదములచేతగాని, ధర్మముల చేతగాని పొందబడేది కాదు. 'హ్యాచింత్యం' చింత చేయడానికి వీలులేనిది. 'హ్యారూపం' రూపమును నిరూపించడానికి వీలులేనటువంటిది.

**శ్లో॥ హ్యాసాధ్యం' హ్యానాద్యం। హ్యాతీతం, హ్యానంతం**

**భావార్థము :** 'హ్యాసాధ్యం' ఏ సాధనముల చేత సాధింపదగినటువంటిది కాదు. 'హ్యానాద్యం' ఏనాదములచేత శోత్రము చేయదగినటువంటిదికాదు. 'హ్యాతీతం' నేననేపదార్థమునకు అతీతముగావున్నది. 'హ్యానంతము' అంతముకానటువంటి స్వరూపమైయున్నది.

**శ్లో॥ హ్యాశుద్ధం, హ్యాబుద్ధం। హ్యానామం నమామి.**

**భావార్థము :** "హ్యాశుద్ధం, హ్యాబుద్ధం, హ్యానామం నమామి". సత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము అని ఎరుకకు అంటే ఆత్మకు పేర్లున్నాయి. 'హ్యాశుద్ధం' అంటే శుద్ధమని చెప్పదిగినటువంటిదికాదు. 'హ్యానామంనమామి' ఏ నామము చేత వర్ణించేకి వీలుకానటువంటిదానికి నేను నమస్కరిస్తు ఉన్నాను అని పరిపూర్ణ బయలును ఈ రకంగా సాధన దశలో మనము శోత్రము చేస్తాము.

శ్లో॥ మృత్యుజన్మభయదుఃఖవర్జితం॥

భావార్థము : 'మృత్యుజన్మ భయదుఃఖవర్జితం' దానికి మృత్యువున్నదని గాని, జనన మరణముల భయము గాని లేదు. ఇవన్ని వర్జించి అంటే విడిచి యున్నది.

శ్లో॥ సర్వదృశ్యదృక్ ద్రష్టనాశనం॥

భావార్థము : 'సర్వదృశ్యదృక్ ద్రష్టనాశనం' దృశ్యము, దృక్, ద్రష్ట అనే త్రిపుటులు ఎరుకకు వున్నవి. ద్రష్ట అంటే లోపల వుండే జ్ఞానము. దృక్ అంటే మధ్యలోవుండే నేత్రాలు. దృశ్యము అంటే ఈ కనబడేటటువంటి ప్రపంచము. కాబట్టి ఇట్టి త్రిపుటులు లేనిదని భావము.

శ్లో॥ అప్రతర్క్యమమలం నిరామయం॥

భావార్థము : 'అప్రతర్క్యమమలం నిరామయం' తర్కించేకి వీలులేనిది అమలమైనటువంటిది అంటే మలము లేనటువంటిది. 'నిరామయం' ఏ అమయములు లేనటువంటి యొక్క స్వరూపము.

శ్లో॥ అనుపమానమచలం। నమామ్యహం॥

భావార్థము : 'అనుపమాన మచలం నమామ్యహం' కొంతకాలము ఉపమానములచే బోధ చేస్తారు. తరువాత వస్తువు ప్రత్యక్షమైన తరువాత ఏ ఉపమానములు నిలబడవు. ఏ ఉపమానము చేత చెప్పడానికి వీలులేనటువంటి అచలపరిపూర్ణ పరబ్రహ్మమునకు నా నమస్కారములు.

శ్లో॥ నిత్యపూర్ణాయసత్యాయ। నిశ్చలాయ నిరీహ్యతే॥

భావార్థము : 'నిత్యపూర్ణాయసత్యాయ' నిత్యము పూర్ణము, సత్యమైనటువంటి స్వరూపము. 'నిశ్చలాయ నిరీహ్యతే' నిశ్చలము అంటే చలనము లేనటువంటిది. నిరీహ్యతే అంటే ఊహించడానికి వీలుకానటు వంటిది.

శ్లో॥ నిర్మలాత్మ స్వరూపాయ। నిర్గుణాయ నమోనమః॥

భావార్థము : 'నిర్మలాత్మస్వరూపాయ నిర్గుణాయ నమోనమః' నిర్మలమైన ఆత్మస్వరూపము కలిగినటువంటిది. సృష్టికి కావలసినటువంటి ఏ గుణము లేనటువంటి పరిపూర్ణ పరబ్రహ్మమునకు నా నమస్కారములు.

శ్లో॥ ఏ తన్మిధ్యా శుద్ధవియత్ । కించిన్నాస్తి తితేమయా॥

భావార్థము : 'ఏతన్మిధ్యాశుద్ధవియత్ కించిన్నాస్తి తితేమయా' ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదు అనేటటువంటి పవిత్రమైన మంత్రమును.

శ్లో॥ కృపయ పరమం ప్రోక్తం। భజగ్రేద్వాదశాక్షరం॥

భావార్థము : 'కృపయపరమం ప్రోక్తం' కృపచేత నాకు ప్రసాదిస్తిరి. కాబట్టి 'భజాగ్రేద్వాదశాక్షరం' ఎప్పుడుకూడా ఈ ద్వాదశాక్షరి మహామంత్రాన్ని జపిస్తాను.

# షోడశాక్షరి మహామంత్రము

అస్యశ్రీ నిరుపమాన షోడశాక్షరి మహామంత్రస్య। నిరంజన ఋషిః। నిరహంకార నిశ్చందః। నిరామయ నిరాకాశోదేవత। నిరావరణ బీజం। నిస్త్రైగుణ్యాశక్తిః। నిర్గుణ ప్రజ్ఞాన రహిత కీలకం! నిఖిల కాలేషు మాయాసహిత షడ్భూతరహిత దశేంద్రియ పంచప్రాణమనోబుద్ధి సహితః సూక్ష్మశరీర మహకారణ శరీర రహిత సిద్ధ్యర్థం! షోడశాక్షరి మహామంత్ర జపం కరిష్యే॥

భావార్థము : ఈ షోడశాక్షరి మహామంత్రమునకు షడంగములు అంటే ఆరు అంగములున్నవి. వేదములకు ఎలా జ్యోతిష్యము, చంధస్సు, నిరుక్తము, కల్పము, శిక్ష, వ్యాకరణము అనే ఆరు అంగాలు వున్నవి. ఆ విధంగానే ఈ మహామంత్రానికి కూడా ఆరు అంగాలు వున్నవి. షడంగములు లేని మంత్రములను జపించరాదు. ఇది సిద్ధాంతవాక్యము అయినప్పటికి దీనికి షడంగములు పెట్టినారు, ఎట్ల ఋషి, చంధస్సు, దేవత, భీజము, శక్తి, కీలకము అని, మనకు నిరంజన ఋషి ఈ వేదము కనిపెట్టి దీని మూలమును విచారించినారు. అంటే దీన్ని మొట్టమొదట కనిపెట్టినవారు శ్రీ దక్షణామూర్తి. ఆయన స్వయంభు బ్రహ్మగా మారి ఈ యొక్క నిజాన్ని చూపించినారు.

'అస్యశ్రీ నిరుపమాన షోడశాక్షరి మహామంత్రస్య, నిరంజనఋషిః' 'నిరుపమాన' అంటే ఉపమానము లేదు. ఎంతవరకు ఉపమానము వుంటుందంటే బోధ నిమిత్తమై ఉపమానము చెప్తారు. ఇక ఆ తరువాత. స్వరూపము తెలిసిన తరువాత ఉపమానములుండవు. 'షోడశాక్షరి

మహామంత్రస్య నిరంజన ఋషిః' ఈ మంత్రాన్ని కనిపెట్టిన ఋషి ఎవరు? అంటే నిరంజన ఋషి. ఋషులు అంటే మంత్ర స్రష్టలు అంటే మంత్రాన్ని సృష్టించినవారు. తరువాత వచ్చే వాళ్ళందరు మంత్రద్రష్టలు, ఆ మంత్రాన్ని చూచుకుంటు పోయేవాళ్ళు. 'నిరహంకార నిశ్చందః' నిరహంకారము, అహంలేదు అనేటటువంటి బోధచేయడమే దీనియొక్క వేదము. చందస్సు అంటే వేదము. 'నిరామయ నిరాకాశోదేవత' ఆమయములు అంటే కల్పనలు నిరామయం అంటే కల్పనలు లేనిది. 'నిరాకాశోదేవత' ఇంకొక దాన్ని సృష్టించకుండా సృష్టికి పూర్వము తనకు తానె స్వతః సిద్ధముగా వుండే స్వరూపము. అందుకే ఇది నిరాకారము, నిరాకాశోదేవత 'నిరావరణ భీజం' అవరణ లేని భీజం, సృష్టికంతా తానే ఆవరణము అయినా కూడా సృష్టి తనలో లేనప్పుడు దానికి నిరావరణ స్థితి ఏర్పడుతుంది. 'నిస్రైగుణ్యశక్తిః' గుణములు లేకుండా వుండడమే దీనికి శక్తి 'నిర్గుణ ప్రజ్ఞానరహిత కీలకం' గుణముల సంయోగములేని జ్ఞానము నిర్గుణమైనటువంటి ప్రజ్ఞానము. ఏ గుణములు లేకోకుండ సాక్షి మాత్రము అయినటువంటి జ్ఞానము వుందే అది దీనికి నిజమైనటువంటి కీలకము. 'నిఖిలకాలేషు మాయసహిత' అన్ని కాలములలో మాయతో కూడుకున్నటువంటిది. 'షడ్భూతరహిత' ఆత్మకు కూడా భూతము అని ఎందుకు అనవలసి వచ్చిందంటే ఆత్మ భూతముకాక పోతే ఇంకొక భూతము పుట్టించదు కాబట్టి, పంచ భూతములు పుట్టేకి తానే ఆధారంగా వుంది కనుక దానికి భూతమనే ప్రయోగము చేసినారు. ఈ ఆత్మ మరియు పంచభూతాలు కలసి ఆరు భూతాలు. ఈ ఆరుభూతాలు లేనది. 'దషేంద్రియ పంచప్రాణ మనోబుద్ధి సహిత సూక్ష్మశరీర' కర్మేంద్రియములు - 5, జ్ఞానేంద్రియములు - 5, ప్రాణేంద్రియములు - 5, మనస్సు, బుద్ధి, ఈ 17 తత్వములతో సూక్ష్మ శరీరము, లోపల ప్రపంచాన్ని పుట్టించుకొని సుఖదుఃఖాలు అనుభవిస్తాది. బయట ప్రపంచాన్ని సృష్టించుకొని సుఖ దుఃఖాలు అనుభవిస్తాది. ఇది సూక్ష్మశరీర ధర్మములు. ఇది ప్రతిరోజు లయము అవుతావుంది మళ్ళీ వస్తావుంది. కాని దీనికి కారణమైన వస్తువు తీసివేయాలి కాబట్టి, దీనికి ఏది కారణము అంటే 'మహకారణశరీర రహిత సిద్ధ్యర్థం షోడశాక్షరి మహామంత్రజపం కరిష్యే'' మహకారణ శరీరము అంటే ఎరుక

అదే నేను అనేటటువంటి పదార్థము. దీన్ని రహితము చేసే సిద్ధి కలిగేదానికి షోడశాక్షరి మహామంత్రాన్ని జపం చేయాలి అని చెబుతుంది.

షోడశాక్షరి మంత్రానికి కరన్యాసము, హృదయధిన్యాసము (అంగ న్యాసము) అయిన తరువాత

శ్లో॥ సమస్త నిర్మోహయ త్రైకాలేషు మద్రహిత నిశ్చయో
భూర్భవస్సువరోమితి దశ దిగ్భంధః॥

భావార్థము : 'సమస్త నిర్మోహయ' నేతినేతి ఇతి మహావాక్యము చేత, ఇది నేను కాదు ఇదినేనుకాదు అని సమస్తాన్ని నిరసించి, ఇన్నిటిని నిషేధించగా మిగిలిన శేషవస్తువును నేనే నని ఏ వస్తువు అయితే తెలుసుకుంటుందో ఆ నేనును కూడా 'త్రైకాలేషు మద్రహిత నిశ్చయో' మూడు కాలములందున నేను రహితమనే మంత్రమును నిశ్చయముగా నిర్మూలించుకునే దానికిగాను

శ్లో॥ భూర్భవస్సు వరోమితి దశ దిగ్భంధః॥

భావార్థము : 'భూర్భువస్సువరోమితి దశ దిగ్భంధ : 'భూలోకము, భూవర్లోకము, సురలోకము అని మూడు లోకముల యందున అష్టదిక్కులు కాకుండ, లోపల వెలుపల కూడా మొత్తము పది దిక్కుల్లో దానియొక్క స్వరూపము నాకు సిద్ధించుగాక అని ధ్యానము చేయవలెను.

షోడశాక్షరి స్వరూపమైన దైవాన్ని, ఆ మంత్రదేవతను ఎలా ధ్యానించాలి అనేటటువంటిది ధ్యానము.

శ్లో॥ సర్వనిగమగుహ్యాం। శాశ్వతం సర్వకాలం।

భావార్థము : 'సర్వనిగమ గుహ్యాం' నిగమములు అనగా వేదములు. ఈ వేదములన్నిటిలో రహస్యమైనటువంటిది. 'శాశ్వతం సర్వకాలం' సర్వకాలము లందు శాశ్వితముగా వుండేది.

శ్లో॥ సకల దివిజవంద్యం। సర్వదిక్పూర్ణమచలం।

భావార్థము : 'సకల దివిజ వంద్యం' ద్విజులు అంటే దేవతలు, 33 కోట్ల దేవతల చేత నమస్కరింపదగినటువంటిది. 'సర్వదిక్పూర్ణమచలం' అన్ని దిక్కులందు పూర్ణమై, చలనము లేని స్థితిలో వుంది.

శ్లో॥ సకల భయనివారం । సర్వలోకాంతరస్థం।

భావార్థము : 'సకలభయ నివారం' ఇప్పుడు జననమరణ భయములు, సుఖ దుఃఖాది భయములు, ఇవన్ని కూడ ఎరుక యందు తోస్తాయి. కాని

ఇది ఏకవస్తువు కాబట్టి దానికి రెండో వస్తువుతో భయముండదు. 'సర్వ లోకాంతరస్థం' అన్ని లోకములు దాని అంతరములో వున్నవి.

శ్లో॥ సకలముని హృదిస్థం। సర్వదేశ ప్రశస్తం'।

**భావార్థము :** 'సకలముని హృదిస్థం! ముని అంటే మననశీలుడు, ఎన్నో విధములుగా ఆలోచించెవానికి ముని అని అంటారు. అందుకు బ్రహ్మమును, ఆత్మను గురించి ఆలోచించెటటువంటి వారు అందరి హృదయములో ఆలోచనా శక్తిగా వుండారు. అందుకు 'సర్వదేశ ప్రశస్తం' అన్నిదేశముల యందున వున్నది.

శ్లో॥ నజ్ఞాతం పరవస్తురూపరహితం । నిస్తేజమమృతం సదా॥

**భావార్థము :** 'నజ్ఞాతం పరవస్తురూపరహితం' నజ్ఞాతం పరవస్తురూపం' అని చెప్పేది శంకర సిద్ధాంతము. ఈ జ్ఞానము కూడా చైతన్యం అనే మహసముద్రములో పుట్టెటటువంటి అల. జ్ఞానము కూడా ఒక అవస్థ. కాబట్టి ఈ జ్ఞానావస్థకంటే చైతన్య స్వరూపము చాల గొప్పది. అందువల్ల 'నజ్ఞాతం' జ్ఞానము లేని స్వరూపమై యున్నది. అని శంకరులన్నారు. ఇక్కడ దీక్షితులు అంటున్నారు 'నజ్ఞాతం పరవస్తురూప రహితం' జ్ఞానములేని పరవస్తువు కూడా లేనటువంటిది కావాలి. అది దీని యొక్క సిద్ధాంతము. 'నిస్తేజంమమృతం సదా' ఏ తెజస్సులేనటువంటిది, ఎప్పటికి ఏ మరణము లేనటువంటిది.

శ్లో॥ నిశ్శబ్దం : నిరూపాసనం, నిరుపమం। నిర్దేశపూర్ణస్థితం।

**భావార్థము :** 'నిశ్శబ్దం' శబ్దము పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ. పరా రూపమైనటువంటి జ్ఞానశరీరములో మొట్టమొదట కలిగేటటువంటి స్మరణకు పరావాక్కంటారు. ఆ పరావాక్కు శబ్దరూపములో రావాలంటే మూడు తరగతుల మార్పు చెందాలి. అది పశ్యంతి స్థానానికి వచ్చి ఒక సంకల్పాన్ని రూప కల్పన చేసి, మరి మద్యమవాక్కు దగ్గరికి వచ్చి కంఠములో రూపాన్ని సంతరించుకొని వైఖరీ వాక్కుగా బయటికి రావాలి. ఇది ఏక కాలములో జరుగుతూ రావాలి. భావము లోపల సంకల్పరూపములో పుట్టిన వాక్కు ఈ వైఖరీ వాక్కుదగ్గరకు వచ్చెసరికి ఇంతమార్పులు అవుతుంది. కాని అటువంటి మార్గము నడిచె శబ్దము కాదు ఇది. 'నిరూపాసనం' ఉపాసన చేసేటటువంటిది కాదు. 'నిరుపమం' ఉపయోగించడానికి కూడా వీలుకానిది.

'నిర్దేశపూర్ణ స్థితం' నిర్దేశించదగినటువంటిది. స్థితికలిగినటు వంటిది. పూర్ణముగా ఉండదగినటువంటిది.

**శ్లో॥ నిత్యాభ్యాస వివర్జితం, విహిత, సద్వ్యాపార శూన్యంసదా।**

**భావార్థము** : 'నిత్యాభ్యాస వివర్జితం' ఏ అభ్యాసము చేయదు, అభ్యాసము చేసి పొందె వస్తువుతానే అయినప్పుడు, ఇక దేని గురించి అభ్యాసం చేయాలి. నాకు పరమాత్మ వున్నాడు, నేను జీవుడను, జపం చేసి నేను పరమాత్మలో కలసి పోవాలి అని అంటే అభ్యాసముంది. పరమాత్మ తానే అయినప్పుడు ఇక అభ్యాసము ఎవరు చేయాలి. ఇక అభ్యాసమనేటటు వంటిది వుండదు. 'విహిత సద్వ్యాపార శూన్యంసదా' విహిత కర్మలైనటు వంటి సద్వ్యాపారాలు ఏవి కూడా లేనటువంటిది. అన్ని శూన్యము చేసుకున్నది.

**శ్లో॥ నిస్సంగం నిరుపాధికం, నిరవయం । నిత్యం హృదింభావయేత్।**

**భావార్థము** : 'నిస్సంగం' సంగవర్జితము, 96 తత్వములు సంగము కానివి. జాగ్రత్త, స్వప్నము, సుషుప్తులు సంగము. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు సంగము. ఈ అన్ని సంగములు వదలిపెట్టి యున్నది కాబట్టి దానికి నిస్సంగము అని పేరు. 'నిరుపాదికం' ఏ ఉపాది లేనిది, జీవోపాది కాని ఈశ్వరోపాది గాని లేనిది. 'నిరవయం' అవయవములు లేనిది. 'నిత్యం హృదింభావయేత్' పరమాత్మ స్వరూపములాంటిది నా నిజస్వరూపము అని నేను హృదయ ములో భావిస్తాను.

**శ్లో॥ ఆనంద రహితోస్మి నిత్యమచలం**

**భావార్థము** : 'ఆనంద రహితోస్మి' ఆనందోబ్రహ్మమని ఆనంద బ్రహ్మమును అంతఃర్భహిస్సులలో కష్టపడి సంపాదించు కుంటున్నారు. ధనము ఆనందమని ధనాన్ని, భార్య ఆనందమని భార్యను, బిడ్డలు ఆనందమని బిడ్డలను, సంపదలు ఆనందమని సంపదలను, ఇవన్ని ఏ విధంగా సంపాదించు కుంటున్నారో అదే విధంగా ఒక సంయోగముతో వచ్చే ఆనందము ఆత్మకు వుంచదు. అందువల్ల పరాధీనముతో వచ్చె ఆనందము ఆత్మకు వుండదు. అందువల్ల పరాధీనముతో వచ్చె ఆనందములు ఏప్పటికి లేనటువంటిది. రహితమైనటు వంటిది. 'నిత్యమచలం' నిత్యమైనటువంటిది, చలనము లేనటువంటిది.

శ్లో॥ నిర్ఘాత, నిర్ఘోత, నిరీంద్రియత్వం।

భావార్థము : 'నిర్ఘాత' అంటే ఘాతము పడనటువంటిది. 'నిర్ఘోత' ఘోత పడనటు వంటిది. ఇది ఎట్ల అంటే మనకు గీత యందున అస్త్ర శస్త్రముల చేత ఎట్ల ఛేదింపబడదు అని చెప్తారో అట్ల నిర్ఘాతము, నిర్ఘోతము అని 'నిరీంద్రియత్వం' ఇంద్రియలోలత్వము లేదు దీనికి ఇంద్రియములు లేవు.

శ్లో॥ నిర్మోహ, నిర్ద్వింద్వ, నిరూపసత్యం।

భావార్థము : 'నిర్మోహ' మెహము లేనటువంటిది. 'నిర్ద్వింద్వ' నిజాముగా ద్వంద్వములు లేనటువంటిది. నీవు బాగా అనుభవములో చూడాలి అంటే నిద్రయందున సర్వప్రపంచమును 96 తత్వములతో కూడినటువంటి ధర్మాన్ని నీలో అణచిపెట్టుకొని వుండావు. ఇది బయటికి వచ్చినప్పుడు ఆ ఒక్కటి ఇన్ని రూపాలు ధరించి వచ్చింది. విచారించి చూస్తే ఇన్నిటికి ఆ ఒక్కటే కదా కారణము. అందుకు బాగా విచారించి చూచినామంటే అది ద్వంద్వము లేనటువంటిది. 'నిరూపసత్యం' రూపము లేనటువంటిది, సత్యమైనటు వంటిది.

శ్లో॥ మహద్గురుం నిత్యమహం నమామి।

భావార్థము : 'మహద్గురుం నిత్యమహం నమామి'' అట్ల మహగురు స్వరూపమైన ఆ గొప్పదైన వస్తువుకు ఎల్లప్పుడు నేను నమస్కరిస్తాను అని అంటారు.

శ్లో॥ నిరాలంబాయ నిత్యాయ। నిర్మలాయా నిరంజన।

భావార్థము : 'నిరాలంబాయ' అంటే ఏ ఆలంబనము, ఏదాని ఆధారము లేనటువంటిది. 'నిత్యాయ' నిత్యము వుండేటటు వంటిది. 'నిర్మలాయ' మలినము లేనటువంటిది. 'నిరంజన' అంజనమనె జ్ఞానము లేనటువంటిది. ఇట్ల స్వరూప రహితమైనటువంటిది.

శ్లో॥ నిత్యశుద్ధాయ, బుద్ధాయ। వస్తుమద్రహితం నమః॥

భావార్థము : 'నిత్యశుద్ధాయ బుద్ధాయ వస్తుమద్రహితం నమః' నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తమని కదా ఇంతవరకు శృతులన్ని పొగిడిందేది. అట్ల నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తమైనటువంటి వస్తువు లేనటువంటిది ఇది. ఈ విధంగా స్వరూపరహితమైనటు వంటిది. ఆ వస్తురహితమైన ఆ వస్తువునకు నా నమస్కారములు అనే భావము.

శ్లో॥ నిర్మూలమేతదా జ్ఞానాచ్ఛరీరం నాస్తి కేవలం
షోడశాక్షరితత్సిద్ధ। మిమవప్యనిశం భజే॥

భావార్థము : 'నిర్మూలమేతదా జ్ఞానాచ్ఛరీరం నాస్తికేవలం' అనేటటువంటి షోడశాక్షరి మహామంత్రాన్ని సిద్ధి పొందడానికి ఎప్పుడు నేను భజిస్తాను. మరియు అనిశము నేను స్మరిస్తాను అని చెప్పినారు.

శ్లో॥ నిర్మూలమేతదా జ్ఞానశ్ఛరీరం నాస్తి కేవలం
మూలంలేని యీగురైరిగే శరీరం ఏమిలేదు.

భావార్థము : 'ఏదానికైన ఒక మాట చెప్తే దానికి స్వరూపము, స్వభావము, స్వస్థానములు వుంటాయి. ఆ విధంగానే ఎరుకకు స్వరూపము, స్వభావము, స్వస్థానము వుంటాయి. అట్ల త్రిపుటలతో కూడుకున్నటు వంటిది ఎరుక. ఎరుక వున్నది, ఎక్కడ వున్నది? దాని స్థానమేది? అన్నప్పుడు అది మూర్ధిని స్థానము, సహస్రారము, సుషుమ్నానాడి, అది తొర్రలు తొమ్మిది గల మేన్మరి లోపల వుండేటటు వంటి యొక్క స్వరూపము అని దానికి స్థానము చెప్పినారు. అది ఏమి చేస్తాది? సమస్తమును ఎరుగుతాది, తనను ఎరుగుతాది, తనకంటే అన్యమైన దాన్ని ఎరుగుతాది. స్వరూపము ఎటువంటిది? తాను స్వయంబుగా ప్రకాశించి, తనను అశ్రయించినటు వంటి దేహేంద్రియ ములన్నిటిని కూడా ప్రకాశింపచేస్తాది. కాబట్టి ఈ విధంగా దీని స్థాన, స్వరూప, స్వభావాలు తెలుసుకొని తనను ధ్యానము చేస్తే, ఈ మంత్రములో ఇంత బ్రహ్మాండమైన బ్రహ్మవిద్యను నిక్షిప్తముచేసి మనకు కేవలము నాలుగైదు శ్లోకాలులోనే అందించినారు. దీనియొక్క రహస్యమే మనకు సకల వేదాలలోని సారాంశము సిద్ధిస్తాది.

# దృష్ట ద్రాష్టాంతము

ద్వాదశీ, షోడశీ మంత్రములు అయిన తరువాత, దృష్ట ద్రాష్టాంత బోధ అని పరిష్కార వాక్యంగా ఒకటి దృష్టంతము మరియు ద్రాష్టాంతము చెప్పినారు.

**శ్లో॥ స్వప్నే ప్రతీయమానాని రూపాణీచయథాతథా**
**కర్పూర దీప సంయోగం। జ్యోతిరూపం యథాతథా॥**

**భావార్థము** : "కలలో దోచిన శరీరాలెలాగో అలాగే కర్పూరము కళిక కూడితే యేలాగో అలాగే".

ఎరుకయందు జగత్తు తోస్తావుంది. కాబట్టి జగము ఎట్ల తోచింది అని అన్నప్పుడు కం॥ "దృష్టాంత మెరుక కేదని యోష్టము గదిలించగానే యొరులు కలనుచున్". ఎరుకయందున తోచె జగము ఏ అవస్థలో తోచినా అది కలె. ఎరుక పుట్టినప్పటి నుండి ఎప్పుడు కలె గాని మెల్కకాదు. ఎరుక లేకపోవడమె మెల్క. కాబట్టి ఆ రకంగా కలదృష్టాంతముచేత ఎరుకకు తోచిన దృశ్యాన్ని తీసేసిరి. ఇక ద్రష్టను తీయాలి. అందుకు 'కర్పూరదీప సంయోగం జ్యోతి రూపం యథాతథా'. ఇప్పుడు జగత్తుకు కారణభూతమైనటువంటి నేననే పదార్థాన్ని గురువాక్యమనే అగ్నిచేత, కర్పూరం కళిక కూడితే అన్నట్లు, రెండు ఏకమై లేక పోయినట్లు. ఆ విధంగా శిష్యుడు, గురువు యొక్క బోధ రెండు కలిసి, తాను, గురుబోధ తనతోనహ లేకుండా పోయేటటువంటి బోధ విచారించాలి. అందుకు స్వప్నముగా తోచినటువంటి జగత్తును తీసేసేకి స్వప్న దృష్టాంతమును, జగత్తుకు మూలకారణమైనటువంటి ఎరుకను తీసేసే దానికి కర్పూరకళిక దృష్టాంతాన్ని పెద్దలు చెప్పినారు. కాబట్టి

**శ్లో॥ ఇతిమంత్ర సమానైవ। సాందీప గుర్వగ్రణీ।**
**కృష్ణస్యమస్తకేనస్య। హస్తం తూష్ణీంబ భూవహ॥**

**భావార్థము** : 'ఇతి మంత్ర సమానైవ' ఈ దృష్ట ద్రాష్టాంత వాక్యాలు కూడా మంత్ర సమానమైనటువంటివే. మంత్రములు కాకపోయినా, మంత్రసమానమైన నిర్ణయాలు కలిగించేటివి. 'సాందీప గుర్వగ్రణి' గురువులలో

శ్రేష్టుడైనటువంటి సాందీపమహాఋషి 'కృష్ణ స్యమస్త కేనస్యహస్తం' ఆ కృష్ణుని యొక్క మస్తకము నందు తన హస్తాన్ని పెట్టి, 'తూష్ణింబ భూవహ' ఇక మాట లేనటువంటి స్థితిని, భావము లేనటువంటి స్థితిని కలిగింపచేసినారు. ఇప్పుడు మన గురుదేవులు కూడా దృష్ట ద్రాష్టాంత వాక్యాలు చెప్పినాక మన శిరస్సు మీద చేయిపెట్టి, నీవు అటువంటి స్థితిని పొందునాయనా, ఇక ఏ చింతలు, చికాకులు వున్నావని భ్రమగాని, లేవని భ్రమగాని లేకోకుండా, నిర్మలంగా వుండమని చెప్తారు. ఇది ద్వాదశీ, షోడశీ పరిష్కార మార్గంగా దృష్ట ద్రాష్టాంతముల బోధలచేత, ఈ ద్వాదశీ షోడశీ మంత్రములను దృష్టద్రాష్టాంత వాక్యములచేత ఎప్పుడైతే జపిస్తామో అప్పుడు మనకు జన్మరహితము సిద్ధిస్తుంది.

# పరిపూర్ణబోధ స్తోత్రం

శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యే। నహికరచరణం ననామ గోత్రం
న సూత్రం నోజాతిర్నైవవర్ణో- నభవతుపురుషోనా
నపుంసోనచస్త్రీ నాకారం నైవికారం। నహిజననమరణే
నాస్తి పుణ్యం నపాపం। నో తత్వం తత్వమేకం। సహజ
సమరసం సద్గురుంతం నమామి॥

ఇది గురువు యొక్క నిర్గుణ స్వరూపము. సృష్టికి పూర్వము ఎట్ల వుంది అంటే,

శ్లో॥ యస్యాంతర్నాది మధ్యే నహికరచరణం ననామ గోత్రం

భావార్థము : 'యస్యాంతర్నాది మధ్యే' ఆది మధ్యాంతరములు లేనటువంటిది. 'నహికరచరణం ననామ గోత్రం' కరచరణములు కాని నామ గోత్రములు గాని లేనటువంటిది.

శ్లో॥ నసూత్రం నోజాతిర్నైవవర్ణో। నభవతుపురుషోనా।

భావార్థము : 'న సూత్రం' సూత్రము కానటువంటిది, 'నోజాతి' జాతి కానటువంటిది. 'నైవవర్ణో' బ్రహ్మణాది వర్ణములు కానిది. 'నభవతు పురుషో' పురుషుడు కానటువంటిది.

శ్లో॥ నపుంసో, నచస్త్రీ, నాకారం, నై వికారం, నహిజనన మరణే।

భావార్థము : 'నపుంసో' నపుంసము కానిది, 'నచస్త్రీ' స్త్రీ కానటువంటిది. 'నాకారం' ఆకారము లేనటువంటిది. 'నై వికారం' వికారము లేనటువంటిది. 'నహిజననమరణే' జనన మరణములు లేనటువంటిది.

శ్లో॥ నాస్తి పుణ్యం, నపాపం, నోతత్వం తత్వమేకం।

భావార్థము : 'నాస్తి పుణ్యం నపాపం' పుణ్య పాపములు లేనటువంటిది. 'నోతత్వం తత్వమేకం' ఈ 96 తత్వాలు, 36 తత్వాలు, 25 తత్వాలు అనే సంఖ్య లేనటువంటిది. ఒకే తత్వమైనటు వంటిది.

శ్లో॥ సహజ సమరసం సద్గురుంతం నమామి॥

భావార్థము : 'సహజ సమరసం' సహజంగా అంతటా ఒకటిలాగే వున్నటు వంటిది. 'సద్గురుంతం నమామి' అంతములో సద్గురు స్వరూపానికి నా నమస్కారములు.

శ్లో॥ ఆత్మానాత్మ వినాశహేతుమనిశం । సర్వాతి రిక్తం శుభం।
పూర్ణాత్పూర్ణమ నామయం సుఖతరం, సర్వాపద ధ్వంసకం।
సర్వాజ్ఞాన వినాశకం గురుపదం। సర్వాత్మకం నిర్మలం
సర్వభ్రాంతి వివర్జితం గుణహారం। సంపూర్ణ బోధం నమః॥

శ్లో॥ ఆత్మానాత్మ వినాశహేతు మనిశం। సర్వాతి రిక్తం శుభం।

భావార్థము : 'ఆత్మానాత్మ వినాశహేతు మనిశం' ఎప్పుడు లేనటువంటిది అంటే జీవేశ్వర్లు కానటువంటిది. 'సర్వాతిరిక్తం శుభం' అన్నిటికి వ్యతిరిక్త మైనటువంటిది, శ్రేష్టమైనటువంటిది.

శ్లో॥ పూర్ణాత్పూర్ణమనామయం। సుఖతరం సర్వాపద ధ్వంసకం।

భావార్థము : 'పూర్ణాత్పూర్ణ మనామయం' పూర్ణ, పూర్ణం, అనామయం. ఇప్పుడు ఆమయములు అంటే మార్పు చెందే స్వభావము కలిగినటువంటివి. ఆమయములు లేనిది. 'సుఖతరం' సుఖము అంటే ఒక వస్తువుతో అనుభవించె సుఖము కాదు. తనకు తానుగా అనుభవించె సుఖము. 'సర్వాపద ధ్వంసకం' అన్ని ఆపదలు నాశనము అవుతాయి.

శ్లో॥ సర్వాజ్ఞాన వినాశకం గురుపదం। సర్వాత్మకం నిర్మలం।

భావార్థము : 'సర్వాజ్ఞాన వినాశకం' అంటే అజ్ఞానములు ఎన్ని వుండాయో అన్ని కూడా తొలిగిపోతాయి. 'గురుపదం సర్వాత్మకం నిర్మలం'

గురుస్వరూపమైనట్టి ఆపరమాత్మ లక్షణం అంతటా సర్వాత్మకమై, నిర్మలమై యుంటుంది.

**శ్లో॥ సర్వభ్రాంతి వివర్జితం గుణహరం। సంపూర్ణబోధం నమః॥**

భావార్థము : 'సర్వభ్రాంతి వివర్జితం' సర్వభ్రాంతులను విడిపించేటటు వంటిది. 'గుణహరం' గుణములు లేవు కాబట్టి ఏమాయలు, భ్రాంతులు పనిచేయవు. 'సంపూర్ణ బోధం నమః' ఇది సంపూర్ణ బోధ, మనకు బాధ లేనటువంటి బోధ ఇది. తాను లేని స్థితిని బోధిస్తాది. ఇటువంటి సంపూర్ణ బోధకు నమస్కారములు.

**శ్లో॥ నజ్ఞాతం పరవస్తు నిత్యమచలం, సత్యం, స్థితం, శాశ్వతం**

భావార్థము : 'నజ్ఞాతం పరవస్తు నిత్యమచలం' నజ్ఞాతము అంటే జ్ఞానము కానటువంటిది. పరవస్తువు అది చైతన్య స్వరూపము 'నిత్యమచలం' అంటే ఎల్లప్పుడు అచలముగా వుంటుంది. 'సత్యం స్థితం శాశ్వతం' మన శరీరములో అన్ని అసత్యలు, అనిత్యాలే కాని శరీరము వచ్చినప్పటి నుండి పోయెవరకు శాశ్వితంగా వుండే పదార్థము చైతన్యము. అది స్థితముగా శాశ్వితముగా వుంటుంది. అయితే పరిపూర్ణము వలె శాశ్వితము కాదు. కాని సృష్టి వున్నంత వరకు అది శాశ్వితము.

**శ్లో॥ నిత్యా నిత్య వివేక భేద రహితం నిర్నామ నిర్లేపకం**

భావార్థము : 'నిత్యానిత్య వివేక భేద రహితం' నిత్యానిత్యములను తెలుసుకోవాలి అనేది లేదు. వివేకము అవివేకము ఎప్పుడు వస్తుందంటే రెండు వస్తువులను సాపేక్షాన్ని పోల్చి చెప్పినప్పుడే వస్తాది. కాబట్టి అక్కడ రెండో వస్తువు లేదు. అందువల్ల అక్కడ భేద రహితము. 'నిర్నామ నిర్లేపకం' ఏనామములు జీవేశ్వర్లని, అష్టోత్రశతనామావళి అని ఏపేర్లు వుండవు అవి నిర్నామము. నిర్లేపకము అంటే ఏ కల్పనలు చేయనటువంటిది.

**శ్లో॥ సర్వప్రత్యయహీనకంచ సతతం సర్వత్ర సంస్థం పరం।**

భావార్థము : 'సర్వప్రత్యయహీనకంచ' దానికి ప్రత్యయ్నమైన పదార్థము మరొకటి లేదు. మనము ప్రత్యయ పదార్థముతోనె బోధ చేస్తాము. ప్రత్యయ అంటే నీవు శివాజీ మహరాజులాంటి వాడివి. సత్యహరిశ్చంద్రుడులాంటి వాడివి

అని ఒకరిని ప్రత్యేయం పెట్టి చెప్పెటటువంటిది. కాని నిర్గుణ ఆత్మకు చెప్పాలి అన్నప్పుడు దానికి చెప్పెకి మరొకటి లేదు. కాబట్టి ప్రత్యేయం లేకుండా బోధను ఇట్ల నిరూపమానంగా చెప్తారు. 'సతతం సర్వత్ర సంస్థం పరం' సతతము అంటే ఎల్లప్పుడు 'సర్వత్రా' ఎక్కడచూచినా 'సంస్థం పరం' స్వస్థత పొందినటు వంటి పరమైయున్నది.

శ్లో॥ **వందేహం పరిపూర్ణ బోధమనిశం। సందేహనాశం ప్రభుం॥**

**భావార్థము :** 'వందేహం పరిపూర్ణ బోధమనిశం' నేను నమస్కారము చేస్తున్నాను. ఇది పరిపూర్ణబోధ ఎల్లప్పుడు వుండేటటువంటిది. 'సందేహనాశం ప్రభుం' సందేహము లేనటువంటిది. ఇది వుండవలసిన స్థితి. ఇలా వుంటే నేనే ఈ శరీరము సృష్టి అంతా వ్యాపించి యుండేను అనే భావము వస్తాది. ఇది వచ్చినా వీడు ఎట్ల వుంటాడు అంటే

శ్లో॥ **నాహం మనుష్యో, నచదేవయక్షా, నబ్రాహ్మణ, క్షత్రియ వైశ్యశూద్రాః॥**

**భావార్థము :** 'నాహంమనష్యో' నేను మనుషుడ్నికాను, 'నచదేవ యక్షా' నేను దేవతగాని, యక్షుడ్నిగాని కాను. 'నాబ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాః' నేను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుడ్నికాను.

శ్లో॥ **నబ్రహ్మచారీ, నగృహీవనస్థో, బిక్షర్నచాహం నిజబోధరూపం॥**

**భావార్థము :** 'నబ్రహ్మచారీ నగృహీవనస్థో' నేను బ్రహ్మచారినికాను, గృహస్థుడ్నికాను. వానప్రస్థుడ్నికాను, 'బిక్షర్నచాహం' నేను సన్యాసినికాను. 'నిజబోధరూపం' ఈ నిజబోధలో ఇవిఅన్ని ఏమి లేవు.

# గురువాక్యోపనిషత్ (పంచశాంతి)

గురువాక్యోపనిషత్, ఉప అంటే సమీపము. నిషత్ అంటే కూర్చోని బోధ వినడము. ఈ బోధ యొుక్క గొప్పతనాన్ని అర్థం చేసుకోవడము, అతిసమీపములో గురువు దగ్గర విన్నటువంటి బ్రహ్మ విద్యను ఉపనిషత్ అని అంటారు. ఈ ఉపనిషత్‌లో గురువాక్యోపనిషత్, ఇది మిగతా ఉపనిషత్‌లో వుండే ధర్మాలను తీసుకొని చక్కనైనటువంటి పదాలతో ఈ ఉపనిషత్‌ను కూర్చినారు. ఇది ఎట్ల అర్థం చేసుకోవాలంటే.

శ్లో॥ ఖం వాయుర్జోతిరాపః। పృధ్వీ విశ్వస్యధారణే
యత్పరం బ్రహ్మ సర్వత్ర। విశ్వాస్యాయతనం మహత్॥

భావార్థము : 'ఖంవాయుర్జోతిరాపః పృధ్వి విశ్వస్యధారణే' 'ఖం' అంటే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి కలసి విశ్వాన్ని ధరిస్తుంది. 'యత్పరం బ్రహ్మ సర్వత్ర' ఏదైతే ఈ ఐదు భూతాలకు ఆధారంగా పరమైయుండి బ్రహ్మరూపము చేత పిలవబడుతూ సర్వత్రా విశ్వానికి ఆధారంగా యున్నదో అది బ్రహ్మమని చెప్పవచ్చును. 'విశ్వాస్యాయతనం మహత్' విశ్వానికి ఆధారభూతుడు అని, దైవము అంటే ఏది? దైవము మనకు ప్రత్యక్షంగా కనిపించదు. పొగను చూచి అగ్గి వుందని ఎలా అర్థము చేసుకుంటామో, విశ్వమును చూచి విశ్వము వెనుక ఒక కర్త నడిపిస్తా వుండాడని అర్థము చేసుకుంటాము.

శ్లో॥ సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం। తత్వమేవత్వమేవతత్
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది। ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా - సర్వబంధైః ప్రముచ్యతే॥

భావార్థము : 'సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం' మనము ఎంత సూక్ష్మంగా ఆలోచిస్తామో అంతకంటే సూక్ష్మమైనటువంటిది. 'తత్వమేవ' అది నేను 'త్వమేవతత్' నీవుకూడా అదే నేను ఏదో, నీవు అదేనయ్యా, 'జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే' జాగ్రత్త, స్వప్న, సుషుప్తనే మూడు అవస్థల చేత మనకు ఈ ప్రపంచమంతా ఎలా ప్రకాశిస్తు కనబడతావుందో 'తద్బ్రహ్మాహమిత జ్ఞాత్వా' ఈ మూడు అవస్థల్ని ప్రకాశింప చేసేటటువంటి బ్రహ్మమును, ఆ ఆత్మను నేను అని ఎప్పుడు తెలుసుకుంటావో అప్పుడు 'సర్వబంధైః ప్రముచ్యతే' 25 తత్వములతో కూడుకున్నటువంటి బంధముల నుండి విడవబడతావు.

శ్లో॥ యోవేదా దౌస్వరః ప్రోక్తో। వేదాంతేచ ప్రతిష్ఠితః॥
తస్య ప్రకృతి లీనస్య। యః పరస్స మహేశ్వరః॥

భావార్థము : 'యోవేదా దౌస్వరః ప్రోక్తో, వేదాంతేచ ప్రతిష్ఠితః' వేదముల

యందు ఏవి స్వర యుక్తముగా చెప్పినారో, వేదాంతములైన ఉపనిషత్తులలో ఏది ప్రతిష్ఠించ బడినదో, 'తస్యప్రకృతి లీనస్య, యఃపరస్సమహేశ్వరః' అటువంటి ప్రకృతి ఎక్కడైతే లీనమై పోతావుందో అట్టిది మహేశ్వరము అదే ఆత్మయొక్క స్వరూపము.

**శ్లో॥ ద్రష్టదర్శన దృశ్యానాం విరామో యత్రవాలభేత్**

**దృష్టిస్తత్రైవ కర్తవ్యా। ననాసాగ్రావలోకనే॥**

**భావార్థము :** 'ద్రష్ట, దర్శన, దృశ్యనాం విరామో యత్రవాల భేత్', ద్రష్ట, దర్శన, దృశ్యము ఈ త్రిపుటి మీదనే ప్రపంచము ఆధారపడి యున్నది. లోపల జ్ఞాన రూపమైనది ద్రష్ట, నేత్రము దృక్కు, నేత్రానికి కనబడే ప్రపంచమంతా దృశ్యము. ఈ మూడు తరగతులలో మనకు సృష్టి కనబడతుంది. అందుకు ఈ మూడు త్రిపుటులు ఎక్కడైతే విరామము చెందుతావుండాయో, ఎక్కడైతె తెలియబడకుండా వుండాయో 'దృష్టిస్తత్రైవ కర్తవ్య' ఈ మూడు లేని చోటనే నీ దృష్టిపెట్టాలి. నీ మనస్సు అక్కడే పెట్టాలి. 'న నాసాగ్రవలోకనే' నీముక్కు కొన చూడు, నీ ముక్కు చివరన చూడు అనే చూపు ఇకలేదు. అందువల్ల నాసాగ్రాన్ని చూడనవసరము లేదు.

**శ్లో॥ అంతఃపూర్ణం బహిపూర్ణం। పూర్ణకుంభ మివాంబసే**

**అంతః శూన్యం బహిః శూన్యం। శూన్యకుంభమివాంబరే॥**

**భావార్థము :** 'అంతఃపూర్ణం బహిపూర్ణం పూర్ణ కుంభమివాంబసే' సముద్రము లోనికి పోయి మనము ఒక కుండను ముంచితే ఆ కుండకు లోపల, వెలుపల, క్రింద మీద ప్రక్కల, ఎక్కడ చూచినా జలమే ఎట్ల వుంటుందో, ఆరకంగా నీకులోపల వెలుపల, సర్వత్రా పరిపూర్ణమైన పరబ్రహ్మ మొక్కటే యున్నది. అదే పూర్ణజలము చూపలేదనుకో, ఇక్కడే చూపాల అనే ఉపమానాకి 'అంతఃశూన్యం బహిః శూన్యం శూన్యకుంభమివాంబరే' అంబరము అంటే ఆకాశము. ఇప్పుడు ఈ బయలులో ఒక కుండపెట్టినాము అనుకో, ఆ కుండకు క్రింద మీద లోపల వెలుపల దాని సర్వత్రా ఆ బయలే వుంటుంది. ఎప్పుడైతే నీవు అంతర్భహిస్సులలో పూర్ణాని తెలుసుకొని నిన్ను

# శ్రీ అచలగురు పరంపర మంగళహారతి

1. శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున ప్రాకటంబుగ హరికి భానునకునూ
ఏకముగ వెలిగేటి యాజ్ఞవల్క్యకి మరియు జోకతోరాజ ఋషి జనకపతికి
॥జయ॥

జగముమంగళము నిత్య శుభమంగళం, జయతు జయ
మంగళము మహోత్సవ మంగళం।

2. శుద్ధ తత్త్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య సద్ధర్మమార్గుడౌ సాందీపునకునూ
సిద్ధముగపూర్ణుడౌ శ్రీకృష్ణమూర్తికిని వద్దికతౌ అర్జునా ఉద్ధవులకూ
॥జయ॥

3. శ్రీమించి వెలిగేటి శ్రీధరస్వామికిని ధీమించు శివరామ దీక్షితులకూ
కామితార్థమునిచ్చు ఘన అప్ప బ్రహ్మముకు వేమారు
శ్రీ సీత రాములకునూ ॥జయ॥

4. పరిపూర్ణబోధను ప్రకట పరచినయట్టి వర భాగవతకృష్ణగురునకిపుడు
నిరతంబు పరతత్త్వ మెరిగించు ఫీల్ఖాన వరలక్ష్మణ ప్రభు చరణములకు
॥జయ॥

5. గురుతుగా ఓంకార గురుపీఠ సిద్ధాంత పరమతత్త్వార్థము భక్తులకునూ
కరుణతో బోధించి కడతేర్చునటువంటి వర వెంకటేశ్వరా గురునకిపుడూ
॥జయ॥

6. భూమ అచలంబని భువిలోనబోధించి పామరత్వము జిమ్మి
ప్రేమనేలి కామితార్థమునిచ్చి కడతేర్చునటువంటి
వేమారు వేముల రామయ్యకు ॥జయ॥

7. యాడజూచినగాని యెడతెగని బ్రహ్మంబు జాడగనుమని
శిష్య ఝుడుపుమాన్పి వేడుకతో బోధించి వీడుమని యెరు
కను ఝాడించె ఆడెపు రాజయ్యకు ||జయ||

8. పరమ పావనమైన అలువాలు వంశమున పరిపూర్ణ బ్రహ్మ
మును పరగదెలిపి, మరణ జనన భ్రాంతి మమతను విడ
జేయు, సరిగ లక్ష్మణాఖ్య గురువరునకిపుడూ ||జయ||

9. మూలమింతయుగాని మూలమేమియులేని మేలైనబ్రహ్మ
మును మేలుకొల్పి వాలాయముగయెరుక వాంఛలీడేర్చు
శ్రీ అలువాల సుబ్బలక్ష్మాంబ కిపుడు ||జయ||

10. కాలకాలములందు గలయకున్నది యేదో
కీలు గనుమని బయలు మేలుకొలిపి
పలుమారు లేనెరుక భ్రాంతిని విడజేయు
అలువాల గురు పార్వతాంబకిపుడూ ||జయ||

11. కాలకాలముగాని మేలైన బ్రహ్మమును
చాలగా శిష్యులకు బోధ చేసి
వాలాయముగ శిష్యవాంచలు వీడేర్చు
అల్వాల శ్రీ కృష్ణయార్యులకునూ
అల్వాల శ్రీ నిర్మలాంబకునూ ||జయ||

12. నీకు మూలము లేక నాకు మూలముగాక,
లోక లోకములన్ని ఏకముగనూ
ప్రాకటంబైనట్టి పరిపూర్ణ బ్రహ్మమును
జోకతో తెల్పు గురు పీఠమునకు ||జయ||

# సాందీప మంగళహారతి - పల్లవి

1. హారతిదుగో మంగళహారతిదుగో ॥హారతి॥ (అనుపల్లవి)
హారతిదుగో జగతియందున అచల పరిపూర్ణతత్త్వవి
చారులగు సాందీపమహఋషి స్వాములకు శ్రీకృష్ణునకును॥

2. పండరీపురమందునిలచి భాగవత భగవద్గీతల ఖండముగ
భక్తులకుదెల్పిన కారణుండగు శ్రీధరేంద్రుల ॥హారతి॥

3. వాశిగా బృహద్వాశిష్టము వ్రాశి నారాయణపురంబున
దేశములలో ప్రకటపరచిన దేశికుడు శివరామదీక్షితుల ॥హారతి॥

4. స్థిరముగను కంబాలూరి పురమునందున యచలబోధను
మురయుచునుఁ భక్తులకుదెల్పి ముక్తినొసగినఅప్పరావుకు ॥హారతి॥

5. పరమపావనమైన యెరగొండపాళెమున భద్రాద్రిరామ
పరమశతకము వ్రాసినట్టి పరశురామ నరసింహ్మల ॥హారతి॥

6. మరియు నాపాళెములో నిలిచి పరమతత్త్వము బోధపరచిన
పరశురామవంశ భవశ్రీ ప్రభువు సీతారాములకును ॥హారతి॥

7. దక్కన్ హైదరాబాద్‌లోపల మక్కువతొ కందార్థములను
చక్కగను రచియించినట్టి సద్గురు భాగవతకృష్ణునకు ॥హారతి॥

8. దీక్షతో నాంపల్లియందున దివ్యముగ గురుగీత అచలము
సాక్షిగా భక్తులకు తెల్పిన స్వామి ఫీల్ఖానశంకరునకు ॥హారతి॥

9. మేలిమిగను భేగంపేటలో చాలగా పరతత్త్వములు
గురుబాలులకును బోధపరచిన ఫీలుఖాన లక్ష్మణార్యుల ॥హారతి॥

10. ధరలొ శ్రీ శివరామదీక్షిత గురుసభలు యేర్పరచిఅచలము
నెరుకపరచెడు వెంకటేశ్వర పరమయోగికి భక్తులకును ॥హారతి॥

11. కొత్తగూడెంకాలరీలో వుత్తబయలె బ్రహ్మమనుచును
చిత్తమలరగదెల్పి శిష్యుల మత్తుబాపిన రామయార్యుల ॥హారతి॥

12. నందికొట్కూరు పీఠమందున పొందుగా నీ పూర్ణబోధను
అందముగ నెరిగించి శిష్యుల మందమతులెడబాపు రాజ
యార్యులకు ॥హారతి॥

13. చాలగా నవనందిపురమున కీలుగనుమని పూర్ణయచలము
మేలుకొల్పియు సుజనజనముల మూర్కమణచిన లక్ష్మణార్యులకు
॥హారతి॥

14. పావనంబగు నందికొట్కూరు పురమునందున పూర్ణబ్రహ్మము
సవినయంబుగసొజ్ఞజేసిన సాధురూపిణి సుబ్బలక్ష్మమ్మకు ॥హారతి॥

15. గట్టిగా నవనందిపురమున దట్టమగు పరిపూర్ణయచలము
గుట్టుదెల్పియు యెరుకజగముల పుట్టిముంచిన పార్వతాంబకు
॥హారతి॥

16. మరియును పీఠస్థులకును పరమతత్వ విచారులకును
నిరతము వేదాంతసభలో నిలకడయిన సాధువులకును
హారతిదిగో మంగళహారతిదిగో॥ ॥హారతి॥

17. మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనె
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం॥

18. మంగళం గురునాథాయ మంగళం అచలాయతే
మంగళం వెంకటేశాయ సచ్చిదానంద మంగళం॥

19. మంగళం గురుదేవాయ మంగళం పరిపూర్ణతే
మంగళం శ్రీరామయార్య వేములాన్వయ మంగళం॥

20. మంగళం దేశికేంద్రాయ మంగళం సత్యసత్సధం
మంగళం రాజయోగీంద్రం ఆడెపాహ్వాయ మంగళం॥

21. కందార్థము : నందికొట్కూరు పురమున అందము శివరామ దీక్షితాచలపీటం పొందుగా నేర్పరచెను. శ్రీ సుందర అలువాల వంశ ॥దర్వు॥ సుబ్బలక్ష్మాంబా భక్తులజేర్చి భోధించునాంబా అందముగా పూర్ణమందు లేనెరుకాను ముందుగా విడిపించి ముదమూననేలు శ్రీ సుబ్బలక్ష్మాంబ భక్తులజేర్చి బోధించు నాంబ॥

# శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరావధూత స్వామివారి స్వకృతం

1. మంగాళం మంగాళం సద్గురురాయ మంగాళం మంగాళం
గురువు శిష్యుడాయె శిష్యుడు గురుడాయె గురువుశిష్యుల
సందు గురుతొక్కటాయె గురువు శిష్యులసందు గురుతుతా
నెరిగితె గురుతులేకపాయె పరిపూర్ణమాయె ॥మంగాళం॥

2. ఘటము మఠంబాయె మఠము ఘటంబాయె ఘటము మఠ
ములసందు నటన అయే ఘటమూ మఠములసందు నటనా
తానెరిగితే పటుతరంబగు బట్టబయలయ్యెపాయె ॥మంగాళం॥

3. పీఠం పాఠమాయె పాఠం పీఠమాయె పీఠం పాఠముసందు
కూటమాయే పీఠం పాఠములసందు కూటమునెరిగితే మాట
మాయమాయె మౌనస్థితాయే ॥మంగాళం॥

4. బోధ శోధ అయె శోధ బోధ అయె బోధ శోధలసందు
మేధ అయే బోధ శోధలసందు మేధా తానెరిగితే వాదాము
లేదాయె నాదాంతమాయే ॥మంగాళం॥

5. యెరుక మరుపాయె మరుపూ యెరుకాయే యెరుక మరు
పులసందు యేకమాయె యెరుక మరుపులసందు యేకాము
నెరిగితె యెరుకా రహితామాయె యేమీలేదాయే ॥మంగాళం॥

6. మంత్రం తంత్రమాయె తంత్రం మంత్రామాయె మంత్ర
తంత్రముసందు మహిమ అయే మంత్ర తంత్రం సందు
మహిమ తానెరిగితె మంత్రములేదాయె యెప్పుడూ బయలాయె
॥మంగాళం॥

7. యోగి భోగి అయె భోగి యోగి అయె యోగిభోగి సందు
ద్యోగమాయే యోగీభోగిసందు ద్యోగమునెరిగితె త్యాగాము
లేదాయె తత్వమైపాయె ॥మంగాళం॥

8. శంక సమ్మతి అయె సమ్మతి శంకాయె శంకసమ్మతి సందు
అంకితమాయే శంక సమ్మతి సందు అంకితమెరగితె వెంక
టేశ్వరుడాయె వేదాంతమాయే ॥మంగాళం॥

9 మనసు మాయ అయె మాయ మనసు అయె మనసు
మాయా తుదకు మాయమాయే మనసు మాయామయ్యే
మహిమదెల్పునట్టి హనుమంత గురుడూ "భూమానంద" మాయే
॥మంగాళం॥

# మంగళ హారతి

1. నిర్వికారాయసకల - నిత్యముక్తిదాయకాయ - నిర్గుణాయ
నిర్మలాయ - నిత్యమంగళం ॥నిర్వి॥

2. సగుణ నిర్గుణ రహితాయ - సంకల్ప వర్జితాయ - సర్వ
సాక్ష్యాతీతునకు సత్యమంగళం ॥నిర్వి॥

3. సత్తు చిత్తు సమసిపాయ - శతృసంహారణాయ - వత్తిలేని
దీపము నీకిత్తు మంగళం ॥నిర్వి॥

4. చేష్టలన్ని ఉడిగిపాయ చేసేదేమి లేకపాయ - శేషమ్మ
మనసు మీలో చేరె మంగళం ॥నిర్వి॥

5. పరిపూర్ణాయ సకల భవ్యదివ్యరూపాయ - పరశురామాయ
సీతా రామమంగళం ॥నిర్వి॥

# మంగళ హారతి

1. స్థిరమగు మీ పదవిని - సుస్థిరముగ - సంస్థాపనంబు చేసి
జనులకున్ - పరిపూర్ణబోధ ప్రకటపరచిన - మరి శివ
రామార్యులాకుమంగాళ మనరే - అర్యులకిపుడు
మంగాళమనరే - పొంగూచుసిద్ధాంత - పూర్ణులైయెరుకాను
- భంగపరచిన గురుపారంపర్యులాకు - మంగాళమనరే -
తత్పీఠముకు మంగాళమనరే॥

2. నిరతము జగములు మీరియు - మరుపును యెరుకయునుగాక
మాయయులేకన్ పరిపూర్ణమైనట్టి - గురునకు - మరి మరి
విశ్రాంతిజెంది మంగాళమనరే - నిత్యముశుభమం
గాళమనరే అంగలింగములాకు అతీతమగు మాయ
సంగరహిత గురుసభకు అధ్యక్షులకు - మంగాళమనరే -
నిత్యము శుభమంగాళమనరే॥

3. మరియును పీఠస్తులకునూ - పరమ తత్వ విచారులకును
-నిరతమూ వేదాంత సభలో నిలకడైన సాధు జనులకు
హారతిదిగో - మంగళ హారతిదిగొ - సద్గురు మూర్తులకు
హారతిదిగో - మంగళహారతిదిగో॥

మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే॥
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం॥